# గాంధీపథం

[ప్రముఖుల ఉపన్యాస సంకలనం]

సంకలనం:

జిజ్ఞాసా సమితి, హైదరాబాదు



కాగడా షష్ఠమ కిరణం :

ప్రథమ ముద్రణ

1957. గాంధీజీ 88 వ జన్మదినం

వెల : ఒక రూపాయి

ముఖచిత్రం

బి. జీ. రాజు

ముద్రణ :

స్వతంత్ర ప్రింటర్సు,

కర్నూలు.

సంపాదకుడు :

సారంగ బలరామయ్య

వెంపో

"మహాత్మాగాంధీ గొప్పతనం ఆయన పడిన కష్టాలలో లేదు. ఆయన జరిపిన పోరాటాలలో లేదు. ఆయన సాధించిన విజయాలలో లేదు. ఆయన జీవించిన పవిత్ర జీవితంలో వుంది."

డా. రాధాకృష్ణ.

ఆరంభిక

## శ్రీ జి. సురవరౌళి

ప్రజా జిజ్ఞాసా సమితి, కాగడా ప్రచురణల ద్వార ఆంధ్రపాఠకులకు అందిస్తున్న తొలి పుస్తకమిది. ప్రజాస్వామ్యంలో దైనందిన రాజకీయార్థికాది సమస్యల గురించి పౌరులు నిరంతరం ఆలోచిస్తూ ఉండాలి. సమాజం యొక్క రూపు రేఖల దిద్దుబాటుకు సంబంధించిన అనేకమైన కొత్త కొత్త సిద్ధాంతాలు మొలకెత్తగల అవకాశం సారవంతమైన ఈ ప్రజాస్వామ్య క్షేత్రంలోనే ఉంటుంది. నాటిని గురించీ, ఉన్న స్థితిని గురించీ పౌరులు సచేతనులై ఆలోచించడం ప్రారంభిస్తేనే తప్ప, 'ప్రజాభిప్రాయం' అనే పదం సార్థకం కాదు. పౌరులందరికీ ప్రత్యక్షంగా రాజకీయాల్లో పాల్గొనడానికి తీరిక లభించదనే మాట వాస్తవమే. అందుకని దైనందిన సమస్యల గురించి సచేతనులైన పౌరులు కూడా ఆలోచించడం మానుకుని సన్యసిస్తే ప్రజాస్వామ్యాలు క్రమంగా పార్టీ నియంతృత్వాలుగా మారి వ్యక్తి నియంతృత్వాలకు దారి తీసే ప్రమాదం ఉన్నది.

ఈ దైనందిన సమస్యల గురించి పౌరులు సచేతనులై ఎప్పటికప్పుడు తమ అభిప్రాయాలను (ప్రకటించక పోయినా)

సుస్పష్టం చేసుకోవడానికి నిరంతర అధ్యయనమే మార్గం. పుస్తక పఠనం, పత్రికా పఠనం, ప్రముఖుల ఉపన్యాసాలు వినటం మొదలైనవి ఈ విధమైన అధ్యయానికి ఉపకరిస్తాయి.

మనకు స్వతంత్రం వచ్చిందతర్వాత మన దేశంలో కొత్త కొత్త ఆలోచనలు బయలు దేరుతున్నాయి. మన మిప్పుడిప్పుడే స్వతంత్రంగా ఆలోచించ గలుగుతున్నాం. మన కొక నూతన తత్వ శాస్త్రం నిర్మాణం కాబోతున్నది. అయితే వ్యక్తిగత అధ్యయనంలో తొలగింపరాని సంకుచితత్వం ఒకటి వస్తున్నది. ఒకనికి ఒక సిద్ధాంతం మీద విశ్వాసం ముందే ఏర్పడుతుంది. ఆ విశ్వాసాన్ని బట్టి అతని అధ్యయన క్రమం రూపు దిద్దుకుంటుంది. ఇదిలా ఉండగా ఒక సిద్ధాంతం ఒక్కొక్కరి సంస్కారాన్ని బట్టి ఒక్కొక్క విధంగా సాక్షాత్కరిస్తుంది. ఈ వ్యక్తిగత సంస్కారం అనేది మనకు తెలియకుండానే మనలో పెరుగుతుంది. సామూహికాధ్యయనంలో ఈ లోపాల్ని కొంత వరకు తొలగించ వచ్చు. అయితే అధ్యయనమంతా సామూహికాధ్యయనమే అయితే వ్యక్తిత్వం క్రమంగా నశిస్తుంది. సామూహికంగా చర్చించినప్పుడు వచ్చిన నిర్ణయాలే పరమ సత్యాలు. తద్భిన్నమైనవీ, తన వైయక్తిక ఆలోచనకు తోచినవిఅసత్యాలుగా పరిగణింపబడే ప్రమాదముంన్నది. అందుకని ఈరెండు ప్రవృత్తులనూ సమన్వయం చేసుకోవలసిన అవసరమున్నది. వ్యక్తిగత అధ్యయాన్ని సాగిస్తూనే అప్పుడప్పుడు సామూహికాధ్యయన చర్చలు సాగించుకోవడం వల్ల ఈ సమన్వయం కొంతవరకు సాధించ

బడవచ్చు. ఈ ఉద్దేశాన్ని సాధించడానికే జిజ్ఞాసా సమితి స్థాపించ బడి కృషి చేస్తున్నది. అదేమేమి సాధించిందీ మొదటిదైన నివేదికకు సంబంధించిన విషయాలు నేమిక్కడ ప్రస్తావించ దలచుకోలేదు.

జిజ్ఞాసా సమితి వంటి అధ్యయన సమితులను వివిధ నామాలతో దేశంలో అక్కడక్కడ విద్యావంతులై, సచేతనులైన పౌరులు స్థాపించుకుని కృషి చేస్తున్నారు. ఈ కృషిని రెండు విధాలుగా విభజించవచ్చు. 1. గ్రంథ ప్రధానమైంది, 2. విషయ ప్రధానమైంది. మొదటి పద్ధతి సమితులు ఒక గ్రంథాన్ని తీసికుని, తమ సభ్యులందరినీ ఆ గ్రంథం చదువమని, ఒకనాడు సమావేశమై ఆ గ్రంథాన్ని, అందులో వెలువరించిన అభిప్రాయాలనూ గురించి చర్చిస్తారు. ఈ గ్రంథాలను ఏరుకోవటంలో సమితి నిర్వాహకుల ఇష్టా నిష్టాలను బట్టి అవి లలిత కళలకు సంబంధించినవో, శాస్త్రీయమైనవో కావచ్చు. ఈ విధమైన అధ్యయన సమితుల స్థాపన, నిర్వహణలో కీ. శే. యమ్. యన్. రాయ్ గారి అనుయాయులు ముఖ్య పాత్ర వహిస్తున్నారు.

విషయ ప్రాధాన్యాలైన రెండో పద్ధతి అధ్యయన సమితులు ఒక విషయాన్ని ముందు నిర్ణయించుకుంటాయి. ఆ విషయం మీద, సభ్యులు, తమ తమ వ్యక్తిగత అభిరుచులనూ సంస్కారాలనూ బట్టి తమకు తోచిన గ్రంథాలను చదువుకుని ఆ విషయం పట్ల తమ అభిప్రాయాన్ని తమ తమ దృష్టి

కోణాలతో స్పష్ట పరచుకుంటారు. తర్వాత సమావేశాన్ని ఆ విషయాన్ని గూర్చి చర్చించుకుంటారు. ఈ పద్ధతినిమళ్లీ రెండు రకాలుగా విభజించ వచ్చు. ఒకటి వివిధ సిద్ధాంతా లకు సంబంధించిన విషయాలను గురించి అధ్యయనం చేయ డం—రెండవది ఒకే సిద్ధాంతంలోని వివిధ రంగాలకు సంబంధిం చిన వివిధ సమస్యలను గురించి అధ్యయనం చేయటం. సోష లిస్టు పార్టీవారు నిర్వ హిస్తున్న (Thought Sessions) థాట్ సెషన్సు ఈ రెండో రకానికి చెందినవే. జిజ్ఞాసాసమితి కార్య కలాపాలు మొదటి రకానికి చెందినవి.

విషయ ప్రధానమైన చర్చల్లో వీలైనన్ని ఎక్కువ విభి న్నాభిప్రాయాలను గురించి తెలుసు కోవడానికి, అధ్యయన మార్గంలోని అనవసరమైన కాలవిలంబనను తొలగించి 'గతి'ని శీఘ్ర తరం చేయడానికి అవకాశం ఉంటుంది. ఒక విషయం మీద విభిన్నమైన అభిప్రాయాలుండటం సహజం. అన్నిం టినీ అధ్యయనం చేసే అవకాశం ఈ విషయ ప్రధానమైన అధ్యయన పద్ధతిలో సాధ్య పడుతుంది. పైగా ఒక విషయం మీద ఒకానొక సిద్ధాంత ప్రవక్త రాసినగ్రంథాలు అనేకం ఉండవచ్చు. ప్రతి సభ్యుడూ తన కభిమానమైన ప్రవక్త రాసిన ఈ అనేక గ్రంథాలనూ చదువుతాడు. ఈ విధంగా ప్రతి సభ్యుడూ తన అభిమాన ప్రవక్తల అనేక గ్రంథాలు చదవటం వలన ఆ సమావేశంలో పాల్గొన్న ప్రతి సభ్యుడూ తాను చదివిన అనేక గ్రంథాల గురించే కాక ఇతర సభ్యులు తమ తమ దృష్టులతో చదివిన అనేకానేక గ్రంథాలను

గురించి తెలుసుకుంటాడు. అందుకే ఈ ప్రకారమైన సమావేశాలలో సభ్యుల సంఖ్యనుబట్టి అనేక గ్రంథాధ్యయనం పరోక్షంగా ప్రతి సభ్యుడూ చేయగలుగుతాడు.

జిజ్ఞాసా సమితి ఈ ఉద్దేశ సాధనకు నెలకొక సారి నిర్ణీత విషయం మీద చర్చా సమావేశాన్ని ఏర్పాటు చేస్తున్నది.

ఒకే విషయం మీద విభిన్న దృక్పథాలు ఒకేరోజు అధ్యయనం చేయటం సంపూర్ణం కాదు. సమగ్రాధ్యయానికి జిజ్ఞాసా సమితి సంవత్సరానికొక సారి ఒక వారం రోజులు కాని అంతకన్నా ఎక్కువ రోజులపాటు గాని, నెలకు మించకుండా ఒకవిషయం మీద దీర్ఘకాలిక అధ్యయనాన్ని సాగించాలని సంకల్పించింది. ఈ ఉద్దేశాన్ని సాధించడానికి, 1957 ఏప్రిల్ 18 వ తేదీనుండి 24 వ తేదీవరకు 'గాంధీ తత్త్వాన్ని' అధ్యయనం చేసే దృష్టితో, గాంధీజ్ఞాన మందిరం వారి సహకారంతో హైదరాబాదు నగరం లోని గాంధి భవనంలో అధ్యయన సప్తాహం నిర్వహించింది. అందులో ఇచ్చిన ఉపన్యాసాల సంకలననే ఈ పుస్తకం.

సంపూర్ణత్వం అనేది ఎందులోనూ ఎప్పుడూ సాధించబడదు. అట్లా సాధించ బడుతుందనుకుంటే మానవ సమాజ వికాసంలో పురోగతి స్తంభించి, స్తబ్దత ప్రవేశిస్తుంది. ఎందుకంటే సంపూర్ణత్వం స్థిరమైంది కాదు. ఇవాళ సంపూర్ణంగా

భాసించింది, రేపటికి అసంపూర్ణమై పోవచ్చు. అయినప్పుడు మా యీ పుస్తకంలోని విషయం 'గాంధీ పథం' యొక్క సంపూర్ణ అధ్యయనం ఎలా అవుతుంది?

కేవలం జిజ్ఞాసా సమితి యొక్క ఈ కార్యక్రమం మాత్రమే దేశంలోని సంకుచితత్వాన్ని రూపు మాపగలదని ఘంటాపథంగా చెప్పనూ లేము. ఇదొక కార్యక్రమం మాత్రమే. వివిధ విభిన్న సిద్ధాంతాలను గురించి తెలుసుకో వాలనే కోరిక ఉన్న వారికి, విభిన్న సిద్ధాంతాల మధ్య సమన్వ యాన్ని ఆకాంక్షించే వారికి ఈ కార్యక్రమం ఉపకరిస్తుంది. నేను నమ్మిందే సత్యం, నా నజ్ఞానమే సంపూర్ణం' అనుకునే వారు ఈ కార్యక్రమంలో—ఈ లాంటి ఏ కార్యక్రమంలో పాల్గొన్నా మా ఆశయం సఫలం కాదు.

జిజ్ఞాసా సమితి నిర్వహణలో మా ఆశయం ఇది అని స్పష్టంగా చెప్పడం కొరకే ఇదంతా ఇక్కడ రాస్తున్నాము. ఈ విధానం నచ్చిన వారు ఈ విధమైన సమితులను స్థాపించు కుని ఎక్కడికక్కడ మన సమాజం ఎదుర్కొంటున్న దైనం దిన సమస్యలను గురించి ఆలోచించడం ప్రారంభిస్తే ఆరోగ్య కరమైనట్టిన్నీ, ప్రజాస్వామ్యాని కనుకూలమైనట్టిన్నీ వాతావరణం సమాజంలో సృష్టించ బడి—ప్రజాస్వామ్యం అది కేవలం ఒక ప్రభుత్వ పద్ధతి (A form of Government) మాత్రమే కాక అదొక జీవిత విధానం (A way of life) గా అనుష్ఠించ బడ వచ్చుననే ఆశ మాకున్నది.

'గాంధీయం' అనే ప్రత్యేక వాదం ఏదీ లేదని, తన తర్వాత తరాలకోసం అలాంటి 'మతాన్నొక' దాన్ని తాను వదలి పోదలచుకోలేదనీ గాంధీజీ పదే పదే చెప్పినా, ఆయన వ్రాసిన సాహిత్యం, ఆ సాహిత్యం పునాదులమీద పరిశోధనలు చేసి ఆయన అనుయాయులు రాసిన పుస్తకాలు, ముఖ్యంగా శ్రీ జె. సి. కుమరప్ప గారి గ్రంథాలు గాంధీజీ ఆశించిన సమాజ స్వరూపాన్ని స్పష్టంగా మన ముందుంచుతున్నవి. అయితే గాంధీజీయే స్వయంగా పై మాటలన్నారు గనుక, మన దేశంలోని వివిధరాజకీయ పార్టీలు తమ తమ 'వీలు' ప్రకారం గాంధీవాదాన్ని నిర్వచించు కుంటున్నాయి.

అయితే ఇప్పుడు దేశం గాంధీజీ అడుగు జాడల్లో నడుస్తున్నదా? నడవ వలసిన అవసరమున్నదా? అనే విషయాలు పాఠకులే నిశ్చయించుకో వలసినవి. పైన చెప్పిన గాంధీయ సాహిత్యంనుండి స్వీకరించిన గాంధీ సిద్ధాంతాలకు రెండు భాగాలున్నాయి. గాంధీజీది 'జీవిత విధానం' కనుక, ఆ రెండు భాగాలూ ఉండటం సహజమే. 1. బ్రహ్మచర్యం, రామభజన, పూర్వాపర జన్మలపైని విశ్వాసం (ఈ విశ్వాసంలోనుండి పుట్టించే ఆయన ధర్మకర్తృత్వ సిద్ధాంతం అని కొందరి వాదన) మొదలైన వైయక్తిక విధానాలు. 2. వికేంద్రీకృత ఆర్థిక రాజకీయ వ్యవస్థలు, గ్రామ రాజ్యం, స్వంత ఆస్తి నిర్మూలన జీవితావసర వస్తువులను కర్మాగారాల ద్వారా ఉత్పత్తి చేయటాన్ని వ్యతిరేకించటం వంటి సామాజిక సిద్ధాంతాలు. వ్యక్తి నుండి సమాజాన్ని వేరుగా ఊహించడం అసంభవం. అశా

శ్రేయం. అందుకని ఆయన నైయక్తిక సిద్ధాంతాలుగా పైన వివరించ బడిన సిద్ధాంతాలు సామాజిక విధానాలను బలంగా ఉంచడానికి వాటిని సాధించడానికి మాత్రమే. సామాజిక సిద్ధాంతాలకు, వాటి సాధనలో అవి అడ్డు వచ్చినపుడు గాని, వాటి అవసరం లేకుండానే సామాజిక సిద్ధాంతాల సమగ్ర సాధన సాధ్యమైనప్పుడు గాని పై నైయక్తిక సిద్ధాంతాలు వదలి వేయటమో, వాటిని సామాజిక సిద్ధాంతాల కను గుణంగా మార్చుకోవటమో చేయవచ్చు. ఏలాగూ పాఠకులీ పుస్తకంలో గాంధీజీ సిద్ధాంతాలను వివిధ దృక్కో ణాలనుండి పరిశీలించ బోతున్నారు గనుక వాటిని నేమి క్కడ ఎక్కువగా వివరించ దలుచుకోలేదు.

అయితే నేడు గాంధీజీ సిద్ధాంతాల ఆమూలాగ్ర అధ్యయనం దేశంలోని ప్రతి సచేతన పౌరుని కర్తవ్యం. ఎవ రికి తోచినట్టు వారు గాంధీ సిద్ధాంతాలను నిర్వహిస్తూ పోతుంటే తమ అసహనాన్ని ప్రకటించ వలసిన బాధ్యత కూడా ఈ పౌరుల మీదే ఉన్నది. 'గాంధీజీ సిద్ధాంతాలు ఇవి—ఇవి దేశానికి (ఉపయోగిస్తే) ఉపయోగిస్తాయి—మంచివి' అని చెప్పడమో 'కాదు గాంధీ వాదం అభివృద్ధి నిరోధకం— ఆయన సిద్ధాంతాలు నిరుపయోగాలు' అని చెప్పడమో చేస్తే పరవాలేదు. కాని నేడు మన దేశంలోని నాయకులు, తమ తమ అభివృద్ధి నిరోధకాలకు, దొంగ తనాలకు, మోసాలకు, అసమర్థతలకు గాంధీయాన్ని పూసుకుని—గాంధీజీ పట్ల పైకి, తమ భక్తి శ్రద్ధలను ప్రకటిస్తూనే [illegible] ఆశయాలను కళం

కితం చేస్తున్నారు. గోడ్సే గాంధీజీ భౌతిక కాయాన్ని కాలుస్తే, వీరు ఆయన ఆశయాలనూ, సిద్ధాంతాలనూ బూడిద చేస్తున్నారు. నిరంతరం గాంధీజీని హత్య చేస్తున్న వీరికన్నా ఒక్కసారే ఆయన్ను హత్య చేసిన గోడ్సే మెరుగేమో ననిపిస్తుంది. వీరినుండి గాంధీతత్వం రక్షించ బడాలంటే ఆలోచనా పరులందరూ, సచేతన పౌరులందరూ, మేధావులందరూ, గాంధీతత్వ రక్షణకు పూనుకోవాలి.

మన దేశంలో నూతన దృక్పథాలనూ, నూతన సిద్ధాంతాలను ప్రాబల్యం పొందకుండా చేయడానికి కొత్తను నిరోధించడానికి రెండు రకాల ఆయుధాలు సంప్రదాయకంగా (బుద్ధుడు, శంకరుడు మొదలుగాగల వారి నాటినుండీ) వాడ బడుతున్నాయి. మొదటి స్థితిలో ప్రవక్తను పిచ్చివాడని ప్రచారం చేయడం. రెండవ స్థితిలో ఆ ప్రవక్తను మహామహుణ్ణో, అవతార పురుషుణ్ణో చేసి పారేశి, విగ్రహాలూ గుళ్లూ కట్టి అయన్ను దేవుణ్ణో దేవుని కొడుకునో చేసి 'అంత మహానుభావుడు కనుక అదంతా ఆచరించ గలిగాడు. మనకు సాధ్యపడుతుందా!' అని ఆయన సిద్ధాంతాలను ఆయన విగ్రహాలక్రింద పాతి పెట్టేయడం. మన దేశంలో ఇవాళ గాంధీజీ సిద్ధాంతాలకు ఆగతే పట్టింది. మూడో పద్ధతి కూడా ఉంది కొత్తను నిరోధించేది. అది ఆదిశంకరాచార్యులు ఆచరించింది. ఈ పద్ధతిలో ఎదుటి వారి సిద్ధాంతపుగొప్పదనాల స్వభావాన్ని వదలి ఆ స్వరూపాలను మాత్రం స్వీకరించి—దాన్ని ప్రజానీకానికి చూపించి, ఎదుటి సిద్ధాంతం క్రొత్తది కాదని, ప్రచారం చెయ్యడం జరుగుతోంది. గాంధీజీ

అడుగుజాడల్లో నడవ దలచుకొని ఉద్యమాలు నిర్మిస్తున్న మన దేశంలోని నేటి కొన్ని ప్రముఖ ఉద్యమాల పట్ల ఈవిధ మైన ప్రచారం జరుగుతుంది. తమకువ్యతిరేకంగా జరుగుతున్న ప్రచారం ఈ పద్ధతిలో తమ ఉద్యమం పూర్తిగా దెబ్బ తినే దాకా ఆ సిద్ధాంతానుయాయులకు తెలియదు. సర్వోదయ ఉద్యమం ఈ స్థితినీ, పై రెండో స్థితినీ కూడా ఎదుర్కొంటు న్నది. బుద్ధమతంలోని 'అహింస' ను శంకరాచార్యుడు హిందూమతంలో చేర్చుకొని ఎదుటి మతాన్ని దెబ్బ కొడుతున్న ప్పుడూ, తమ ఆశయం 'గాంధీజీ అడుగు జాడల్లో సర్వోదయ పద్ధతి సోషలిజం స్థాపించడం' అని కాంగ్రెసు వారు ఘోషించినప్పుడూ అనుసరించ బడుతున్న విప్లవ నిరోధ పద్ధతి ఇదే.

ఈ విషయాలన్నింటినీ దృష్టిలో ఉంచుకుని నేమిూ సప్తాహంలో ఉపన్యసించ వలసిందిగా—నిర్భయంగా సత్యాన్ని చెప్పగలరనిమాకు విశ్వాసంఉన్న వారినే ఆహ్వానించాం. వారు ప్రత్యక్షంగానో పరోక్షంగానో సత్యాన్ని దాచకుండా నే చెప్పారు. విభిన్న దృక్పథాలతో గాంధీజీ సిద్ధాంతాలను పరిశీలించడానికి విభిన్న పార్టీల ప్రముఖులను పిలిచాం. వారుకూడా చెప్పారు. ఎవ్వరూ ఆయన సిద్ధాంతాలకు అన్యాయం మాత్రం చెయ్యలేదు. తమకు వీలున్నట్టు ఆయన సిద్ధాంతాలను నిర్వచించుకోలేదు. వారందరికీ మేము ఎన్ని కృతజ్ఞతలు చెప్పుకున్నా తక్కువే. ఎందుకంటే వారందరూ మేధావులు. తమతమ అభిప్రాయాలను ప్రజానీకం తెలుసు కోవాలనే ఆరాటం వారికున్న మాట నిజమే. అయితే సప్తాహంలో

వీరు ఉపన్యసించడానికి వచ్చినప్పుడు వీరి ఉపన్యాసాలను వినడానికి వచ్చిన వారి సంఖ్య సుమారుగా సగటున 15 మంది. దానికి కారణం వీరు ముఖ్యమంత్రిలో గవర్నర్లో కాక పోవటమే కావచ్చు, అయినప్పటికీ బాధ పడకుండా మాతో సహకరించి, నిరంతరం మమ్ములను ఈ సమితి కార్యకలాపాల్లో ప్రోత్సహిస్తున్న మేధావు లందరికీ మేము కృతజ్ఞతల కన్నా ఏమీ ఇచ్చుకోలేం మరి. మా సప్తాహంలో 'సోషలిస్టు దృష్టితో గాంధీ తత్వం' అనే విషయం మీద ఉపన్యసించిన శ్రీ హెక్టర్ అభయవర్ధన్ గారు తమ ఉపన్యాసం యొక్క ప్రతిని ఇస్తామని చెప్పి, అనివార్య కారణాంతరాల వల్ల గ్రామాంతరం వెళ్లి మాకు సకాలంలో అందివ్వ లేక పోయారు. అందుకని వారి ఉపన్యాసాన్ని ఇందులో ప్రచురించ లేక పోతున్నందుకు మేం విచారిస్తున్నాం.

శ్రీయుతులు కోదాటి నారాయణరావు, గోపీచంద్, యమ్. యస్. రాజలింగం, బలవంతరెడ్డి గారలు తమ తమ ఉపన్యాసాల వ్రాత ప్రతులను స్వయంగా వ్రాసి ఇచ్చారు. శ్రీ బలవంతరెడ్డిగారు (డిప్యూటీ డైరెక్టరు, బ్యూరో ఆఫ్ ఎకానమిక్స్ అండ్ స్టాటిస్టిక్స్) తమ ఉపన్యాసాన్ని ఇంగ్లీషులో వ్రాసి ఇస్తే మిత్రులు శ్రీ బి. నాగేశ్వరావు గారు దాన్ని తెలుగు చేసి ఇచ్చారు. స్వామీ రామానంద తీర్థ గారి ఉపన్యాసం మేము తీసుకున్న నోట్సుమీద ఆధారపడి పునః రచింప బడింది. శ్రీ సుందరయ్య గారి ఉపన్యాసపు పూర్తి పాఠాన్ని విశాలాంధ్ర విలేఖరి నోట్సు తీసుకుని విశా

లాంధ్ర పత్రికలో ప్రచురించారు. దాన్నే యిందులో పున ర్ముద్రిస్తున్నాము. ఈ విధంగా వివిధ గతుల్లో ఈ పుస్తక ప్రచురణకు సహాకరించిన మిత్రులందరికీ మా కృతజ్ఞతలు.

జిజ్ఞాసా సమితి కార్యకలాపాలు ఇకముందు జరిగినా జరగక పోయినా, కాగడా ప్రచురణల వారు కాని, మా సమితి స్వయంగా గాని ఇలాంటి గ్రంథాల ప్రచురణకు పూనుకున్నా పూనుకోనక పోయినా, జిజ్ఞాసా సమితి కార్య కలాపాల వంటి కార్యకలాపాలను ప్రారంభించు కోవడానికి గానీ, ఇలాంటి గ్రంథాలను తక్కువ ధరలకు ప్రచురించ డానికి గానీ ఎవరైనా పూనుకుంటే అభ్యంతరా లెందుకుం టాయి? ఇందులో ఎలాంటి కాంపిటీషనూ లేదుగదా?

---

గాంధీ తత్వము

# శ్రీ త్రిపురనేని గోపీచంద్

నలభై సంవత్సరాల క్రిందట ప్రపంచంలో సంచలనం కలిగించిన ఒక పెద్ద సంఘటన జరిగింది. అదే రష్యా విప్లవం. ఈ విప్లవాన్ని గురించి వ్రాస్తూ జాన్ రీడ్ అనే ప్రఖ్యాత రచయిత తన గ్రంథానికి 'ప్రపంచాన్ని ఊపిన పది రోజులు' అని నామకరణం చేశాడు. కొన్ని సంవత్సరాల క్రిందట నా గురుతుల్యులైన శ్రీ యమ్. యన్. రాయ్ బొంబాయిలో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ కేంద్ర సంఘంలో ఈ విషయాన్ని గురించి ముచ్చటిస్తూ, రష్యా విప్లవాన్ని 'ప్రపంచాన్ని ఊపిన పదిరోజులు' అనటం బాగా లేదు, ఆ విప్లవం ఇంకా ప్రపంచాన్ని ఊపుతూనే ఉంది, దాని కదలిక ల యొక్క ఛాయలు ఇంకా ప్రపంచంలో కనిపిస్తూనే ఉన్నాయి—అన్నారు.

ఇది ప్రశ్నించటానికి వీల్లేని సత్యం.

రష్యా విప్లవం ప్రపంచ స్వరూపాన్నంతా మార్చి వేసింది.

ఆ మార్పుయొక్క ఫలితాలను ప్రపంచం ఇంకా అనుభ విస్తూనే ఉంది. ఆ మార్పు రేపిన వ్యతిరేకత కూడా దాని ఫలితమనేమనం చెప్పుకోవాలి.

ఇటువంటి అద్భుత సంఘటనే 1947 లో మరొకటి జరిగింది. అది, మన దేశంలో మహాత్మా గాంధీ గారు నడి పిన అహింసోద్యమ ఫలితంగా బ్రిటిషువారు మన దేశాన్ని విడిచిపెట్టి పోవటమనేది. రష్యా విప్లవం జరుగుతున్నప్పుడు, దాని వేళ్లు విస్తరిస్తున్నప్పుడు, ఈ సంఘటనకు బీజాలు నాట బడినవి. ఈ రెండు విప్లవాలు బీద ప్రజల నుద్ధరించడానికి జరిగినవే. సంఘంలో ఉన్న దోపిడీని, హెచ్చుతగ్గులను నిర్మూ లించడానికి జరిగినవే. మానవ స్వభావాన్ని మరొక మెట్టు పైకి తీసుకు వెళ్లి అతను బంధింప బడిన దాస్య శృంఖాల నుండి తప్పించి, లోక కల్యాణానికి పాటు పడడానికి జరిగినవే. అయినప్పటికీ ఈ విప్లవాల నాయకులైన కారల్ మార్క్స్, మహాత్మా గాంధీ తాత్విక దృష్టిలో చాలా భేదం ఉంది.

కారల్ మార్క్స్, సంఘం అనేక వర్గాలుగా విభ జింప బడి ఉన్నదని, ఒక్కొక్క వర్గానికి ఒక్కొక్క ప్రత్యేక పరిస్థితి ఉంటుందని, చెదురు చెదురుగా తప్ప ఈ పరిస్థితి ప్రభా వాన్నుంచి మానవులు తప్పించుకోలేరని భావించి, తన తత్వ శాస్త్రాన్ని నిర్మించాడు. అందువల్ల, అతని చేతుల్లో మాన వుడు పరిస్థితుల ప్రభావాన్నుంచి తప్పించుకోలేని, పరిస్థితులకు బానిసైన ఒక యంత్రంగా తయారైనాడు. పరిస్థితులకు బాని

నైన మానవునికి హృదయ పరివర్తనానికి చోటు లేక పోవ టం సహజమే. అందు వల్ల మానవుని హృదయ పరివర్తనం మీద కాక వర్గ కలహం మీద, దాని ఫలితమైన దౌర్జన్యం మీద ఆధార పడ్డాడు మార్క్స్. ఏదో ఒక విధంగా అధి కారాన్ని చేబడితే తప్ప, మానవ కల్యాణానికి ఎవరూ తోడ్పడ లేరనుకొని నిర్ధారణ చేసుకొని తదనుకూలంగా తన ఉద్యమానికి బీజాలు నాటాడు. ఈ దృష్టివల్ల ఆదర్శాన్ని సాధించటానికి అనుసరించ వలసిన మార్గానికి ఒక ప్రత్యేకత గాని, విశిష్టత గాని లేకుండా పోయింది. ఆయన తత్వ శాస్త్ర ప్రాబల్యంతో నడుపబడిన ఉద్యమాలలో మానవునిలో ఉన్న మంచితనాన్ని లేపి సత్ఫలితాలను సాధించడానికి అవకాశం లేకుండా పోయింది.

మహాత్మా గాంధీ దృష్టి దీనికి భిన్నమైంది. ఆయన దృష్టి పూర్తిగా మన పూర్వ సంస్కారాన్ని పునాదిగా తీసు కుని పెరిగిన దృష్టి. మానవుడు దైవాంశ సంభూతుడు. మానవునిలో మంచితనం ఉంది; ఎప్పుడూ ఉంటుంది. కాని విభిన్న కారణాలవల్ల అది మరుగున పడి ఉంటుంది. ఈ మరు గును తొలగిస్తే అది తన దివ్యజ్యోతుల్ని ప్రసరింప జేస్తుంది. అప్పుడు మానవుడు తన పరిస్థితుల్ని అధిగమించి ప్రవర్తించ గలుగుతాడు. ఈ విధంగా భావించాడు మహాత్మా గాంధీ. అందువల్ల మానవున్ని అస్వాతంత్ర్యాన్ని చేసి తన పనిని సాధించుకోడానికంటే, స్వాతంత్ర్యాన్ని ప్రసాదించి, పరి స్థితుల వల్ల వచ్చిన భావాలను తొలగించి, తన ధర్మాన్ని

నెర వేర్చుకోవటం సక్రమమైన దనుకొన్నాడు మహాత్మా గాంధీ. ఈ దృష్టివల్ల కారల్ మార్క్సు ఆలోచించిన ఆలోచనలకు భిన్నంగా వ్యక్తి స్వాతంత్ర్యం మీద, వర్గ సామరస్యం మీద, హృదయ పరివర్తనమీద ఆధారపడి తన ఉద్యమాన్ని నడిపాడు. ఆదర్శానికంటే, దానిని సాధించడానికి అనుసరించే మార్గం, ఆచరణలో పెట్టిన సాధనం ముఖ్యమని మాటి మాటికీ నొక్కి చెప్పాడు.

ఈ రెండు విప్లవాలనూ వాటి ఫలితాలనూ విమర్శించి చూచుకునే భాగ్యం ఈనాడు మనకు కలిగింది. ఈ రెండు దృష్టులలో ఏది సక్రమ మైందో సమగ్రమైందో ఏది ఈ నాటి మన వాంఛలను తీర్చగలదో తెలుసుకో గలిగిన అవకాశం మనకుంది.

పైన చెప్పిన రెండు సంఘటనలతో పాటు, మన హృదయాలను బ్రద్దలు చేసే మరొక సంఘటనను కూడా మనం చూశాం. అది 1948 లో జరిగిన సంఘటన. మన దేశ నాయకుడు, ఒక విశిష్టోద్యమ స్థాపకుడు, ప్రపంచ మార్గదర్శి అయిన మహాత్మ గాంధీ హత్య చేయబడిన సంఘటన. మహాత్మా గాంధీ హత్య చేయబడినాడనే వార్త చెవున పడగానే ప్రపంచంలో ఉన్న ప్రముఖ నాయకులు, గొప్ప వ్యక్తులు ఏవిధంగా సంక్షోభ పడ్డారో తెలుసుకుంటే ఆయన నడిపిన ఉద్యమ ప్రాశస్త్యం, ఆయన మీద ప్రపంచం, అంధకారంలో ఉన్న తనకు వెలుగు చూపుతాడని ఆశించిన ఆశ

యొక్క బలం తేలిగ్గా బోధ పడుతుంది.

ఫ్రాన్సు దేశానికి ఒకప్పుడు ప్రధానిగా చేసిన సోష లిస్టు నాయకుడు లియోన్ బ్లమ్ 'నేను గాంధీగారిని ఎన్నడూ చూచి ఎరుగను, భారత దేశంలో ఎన్నడూ అడుగుపెట్టి ఎరుగను అయినప్పటికీ గాంధీ గారు పోయాడని తెలిసినప్పుడు నేనుఒక ప్రియమిత్రుణ్ణీ సన్నిహితుణ్ణీ పోగొట్టుకున్నట్టు పరితపించాను.' అన్నాడు. ఐక్యరాజ్య సమితిలోని బ్రిటిష్ ప్రతినిధి నోయల్ బేకర్ 'ప్రపంచంలోని దరిద్ర నారాయణులకు, చరిత్ర హీను లకు ఇటువంటి మిత్రుడు మరొకడు లేడు' అన్నాడు. అమె రికా సెనేటర్ వాండన్ బర్గ్ 'నిరాడంబరత్వం, సత్యం, ప్రబల సామ్రాజ్యాలకంటె బలమైనవి అని గాంధీ నిరూ పించాడు' అన్నాడు. బ్రిటిష్ కార్మికోద్యమ ప్రముఖ నాయ కుల్లో ఒకడు, బ్రిటిష్ కాబినెట్ కార్మిక మంత్రుల్లో ఒకడు అయిన సర్ స్టాఫర్డ్ క్రిప్స 'ఆత్మ బలం యొక్క శక్తిని ఇంత మహత్తరంగా నిరూపించ గలిగిన వ్యక్తి ఇటీవలి ప్రపంచ చరిత్రలో మరొకడు లేడు.' అన్నాడు.

ఇదే విధంగా ప్రపంచమంతా వాపోయింది. ప్రపం చం అనుభవిస్తున్న సంక్షోభాన్నుంచి తప్పించ గలిగిన ఒక మహాజ్యోతి ఆరిపోయినట్లు కుమిలి పోయింది. ఒక్క బోల్షి విక్ నాయకుల దగ్గరనుంచి మాత్రం ఏ సానుభూతి సందే శం రాలేదు.

రష్యా ప్రభుత్వ నాయకుల్నుంచి సందేశం రాకపోవ

టం లోకూడా అర్థమున్నది. పైన చెప్పుకొన్నట్లు రష్యా అనుసరిస్తున్న తాత్విక దృష్టికీ మహాత్మా గాంధీ ఆచరణలో పెడుతున్న తాత్వికదృష్టికీ భేదముండటమే దీనికి కారణం. ఇది కూడా మహాత్మా గాంధీ అనుసరిస్తున్న తాత్విక దృష్టి ప్రత్యేకతనే నిరూపిస్తున్నది.

... ... ... ... ...

ప్రపంచాన్ని దిగ్భ్రమ చెందించిన ఇటువంటి మహత్తర శక్తిని మహాత్మా గాంధీ ఏవిధంగా సంపాదించాడు అనేది ప్రశ్న. సాధారణంగా ఒక మహా పురుషుని జీవితాన్ని మనం చదివినప్పుడు అతను పెరిగి పెద్ద వాడైన తర్వాత కనుపించిన విశిష్ట లక్షణాల కదలికలు, చిన్నప్పటినుంచీ ఉంటూ ఉన్నట్టు చదువుకుంటాం. మహాత్మా గాంధీలో మాత్రం ఆయన బాల్యదశలో ఇటువంటి లక్షణాలేవీ కనుపించవు. మామూలు పిల్లలందరూ పెరిగిన విధంగానే ఆయన పెరిగాడు. మామూలు పిల్లల్లో కనుపించే లక్షణాలే ఆయనలోనూ ఉండేవి. కాక పోతే మంచి చేసినా చెడు చేసినా దానిని గురించి తర్కించు కునే స్వభావం ఉన్నట్టు కనిపిస్తుంది. ఈ స్వభావం మహాత్మా గాంధి యొక్క ప్రత్యేక లక్షణం అని చెప్పుకోడాని క్కూడా వీల్లేదు. మానవ జన్మ యొక్క లక్షణమే ఇది. ఈ లక్ష ణాన్ని మహాత్మా గాంధీ స్వశక్తితోనూ, స్వయం కృషి వల్ల వృద్ధిచేసుకున్నాడని మనం అనుకోవలసి వస్తుంది. మామూలు పిల్లలకుండే గుణ సంపత్తితో పుట్టి, మామూలు పిల్లలకు

మల్లేనే పెరిగిన మహాత్మా గాంధీ ఇంతటి ఉన్నత స్థితికి రావటం చూచినప్పుడు, కృషిమాత్రంగా ప్రతి సామాన్య వ్యక్తి పురోగమన శిఖరాల్నందుకో గలడని అనిపిస్తుంది. ప్రతి మనిషికీ ఆదర్శాల కోసం ఆరాటపడాలనే బుద్ధి కలుగుతుంది. ధైర్యం వస్తుంది. తర్వాతి జీవితంలో మహాత్మా గాంధీ పరిస్థితుల ప్రభావం మీదికంటే మానవ శక్తిమీద ఎక్కువ మమకారాన్ని చూపడానికి తన జీవితాన్ని మలిపిన ఈ లక్షణమే కారణం కావచ్చు. ప్రపంచంలో ఉన్న సామాన్య మానవులకు నూతనోత్సాహాన్నీ ఆత్మ బలాన్నీ, కలిగించింది కూడా గాంధీ గారిలో ఉన్న ఈ లక్షణం, ఈ లక్షణంమీద ఉన్న తాత్విక దృష్టీ కారణం కావచ్చు.

మహాత్మా గాంధీ మిగిలిన భారతీయులకు మల్లేనే నిత్య జీవితానికి కావలసిన హంగులను ఏర్పరచుకోవటం కోసం, బారిష్టరు పరీక్ష చదివి ప్యాసయ్యారు. కాని బానిస దేశంలో వ్యవహరించ వలసి రావటం వల్ల, అనేక సంఘటనలు ఆయన అభిమానాన్ని తడవ తడవకూ కించపరుస్తూ రెచ్చగొడుతూ వచ్చేవి. తర్వాత దక్షిణాఫ్రికా వెళ్లిం తర్వాతకూడా ఇటువంటి దుర్భర పరిస్థితుల్నే ఆయన ఎదుర్కోవలసి వచ్చింది. తన తోటి మానవులు పడేపాట్లు, అనుభవించే అవమానాలూ, ఆయన్ను కలవర పెట్టినాయి. ఇదే కాదు, తన తోటి మానవులు ఇతరులను పెట్టే హింసలు ప్రకటించే రాక్షసత్వంకూడా ఆయన్ను కలవరపెట్టటం ప్రారంభించింది. తనలో ఉన్న ప్రతి విషయానికీ తర్కించుకునే బుద్ధి, క్రమ

క్రమేణా వికసిస్తూ రావటం వల్ల తన దృష్టిలో పడిన ప్రతి చిన్న విషయం ఆయనలో ఉన్న మానవత్వాన్ని విజృంభింప జేస్తూ వచ్చింది. నెమ్మదిగా ఆయన కార్యాచరణకు పూను కున్నాడు. దక్షిణాఫ్రికాలో భారతీయు లనుభవించే అన్యా యాలను ఎదుర్కోకుండా ఉండటం, భగవంతునికి అపచారం చెయ్యట మనుకున్నాడు. ప్రభుత్వానికి కను విప్పు కలిగించి, దాని దృష్టి ధర్మాచరణ మీదకు త్రిప్పి, బీద ప్రజల కష్టాలను నిర్మూలించడానికి ఉద్యమం ప్రారంభించాడు.

ఆ రోజుల్లో రస్కిన్ వ్రాసిన అన్ టు దిస్ లాస్ట్ అనేగ్రంథం, టాల్‌స్టాయి యొక్క రచనలూ ఆయన్నెక్కువగా ఆకర్షించాయని ఆయనే చెప్పుకున్నాడు. అంటే వ్యక్తులు గానీ గ్రంథాలుగానీ, ఆయనస్వభావాన్ని మార్చాయనిగానీ, ఆయన అభిప్రాయాలను సరిదిద్దాయని గానీ, మన మనుకో వలసిన పని లేదు. అంతకు ముందునుంచీ ఒక రూపంలో లేని ఆయన భావాలకు, ఈ గ్రంథాలు, గ్రంథకర్తలు రూప కల్పన చేసుకోవటానికి, అందుకు తగిన ధైర్యోత్సాహాలు పెంప గటానికీ సహాయం చేశాయని మాత్రమే మన మనుకోవాలి. ఈ దృష్టితోనే ప్రముఖ వ్యక్తి ఒకాయన గాంధీ గారి మీద పడిన ఈప్రభావాన్ని గురించిచర్చిస్తూ 'రస్కిన్ వ్రాసిన అన్ టు దిస్ లాస్ట్ అనే గ్రంథంలో గాంధీగారు తన మామూలు పద్ధతిని తన అభిప్రాయాలనే చదువుకోగలిగాడు. తన అభిప్రా యాలనేచూడగలిగాడు. తన అభిప్రాయాలనే బలపరచుకో గలిగాడు' అన్నాడు. ఈ ధోరణినే విశద పరుస్తూ రోమా

రోలెండ్ 'టాల్‌స్టాయి, గాంధీ ఇద్దరూ కూడా అహింసా తత్వాన్ని ప్రబోధించిన వారే. అయినప్పటికీ ఇద్దరిలో చాలా భేదం ఉంది. గాంధీగారి అహింసా తత్వం, నిరాడంబరత్వం మీద, నిర్మలత్వం మీద, నిగ్రహం మీద ఆధార పడి ఉండేది. టాల్‌స్టాయి అహింసావాదం మాత్రం అటువంటిది కాదు. ఆయన అహింసా వాదం ఉద్రేకాన్ని ఉద్రేకంతోను, అసహనాన్ని అసహనంతోను, దౌర్జన్యాన్ని సగర్వంగానూ ఎదుర్కొమ్మని చెపుతుంది' అన్నాడు. టాల్‌స్టాయి తత్వ విచారం యొక్క లక్షణాలు గాంధీగారికి తెలియకుండా ఉండి ఉండవు. ఆయన తన సహజ ధోరణిలో ఆ లక్షణాలన్నిటి లోనూ తనకు నచ్చిన అర్థాన్నే చూడ గలిగాడు. ఆ ప్రభావంతో దక్షిణాఫ్రికాలో ఆయన కొన్ని సంస్థల్ని కూడా స్థాపించి కృషి చేశాడు. దక్షిణాఫ్రికాలో ఆయన ఉద్యమం తన కర్తవ్యాన్ని నెరవేర్చుకున్న తర్వాత ఆయన స్వదేశానికి వచ్చాడు. ఇక్కడ ఆనాటి కాంగ్రెసు చాలా మితవాదుల చేతుల్లో ఉంటూ ఉండేది. బ్రిటిషు ప్రభుత్వాన్ని కోరి, ప్రార్థించి, ప్రజలకు కావలసిన పనులను నెరవేర్చుకో వచ్చని ఆనాటి కాంగ్రెసు నాయకులు అనుకుంటూ ఉండేవారు. అదేవిధంగా మహాసభలలో తీర్మానాలను ఆమోదించి ప్రభుత్వానికి పంపుతూ వుండేవారు. ఇటువంటి మిత వాద సంస్థ లోకి మహాత్మా గాంధీ అడుగు పెట్టగానే పరిస్థితులన్నీ తారు మారై పోయినాయి. ఆ సంస్థ నూతనోత్సాహంతో ప్రజల్లోకి చొచ్చుక

పోయి ప్రజా శక్తిని అండగా తీసుకోవాలనే నూతన వాంఛతో ప్రకాశింప మొదలు పెట్టింది. దీనికి తోడు చాంపరాన్‌లో జరిగిన సంఘటన, దాని ఫలితం మహాత్మా గాంధీకి కావలసిన మనోధైర్యాన్నివ్వటమే కాకుండా ప్రజలఆశలు ఆయన మీాద కేంద్రీకరింప బడటానికి కూడా పని చేసింది. ఆనాటి నుంచీ ఈ నాటి వరకూ మన దేశంలో జరిగిన అసహాయోద్యమ చరిత్ర మీా అందరికీ తెలిసిందే. అది చెప్పటం చర్విత చరణమే అవుతుంది. ఈనాడు దాని ఫలితాలను దాని వల్ల వచ్చిన మంచిని ప్రపంచం యావత్తూ అనుభవిస్తూవున్నది. మహాత్మా గాంధీ ప్రారంభించిన అసహాయోద్యమ ప్రాశస్త్యం వల్ల ఈనాడు ప్రపంచం, మన దేశం తమకు మార్గదర్శకం కావాలని కోరుతూ ఉండటం కూడా మీా అందరికీ తెలిసిన విషయమే.

మహాత్మా గాంధీ తాత్విక దృష్టిలో మనం ముఖ్యంగా చెప్పుకో వలసింది ఒకటుంది. అది, ఆయన ఆదర్శానికంటే సాధనానికిచ్చిన ప్రాముఖ్యం. ఇంతకు ముందు నేను చెప్పినట్లు కారల్ మార్క్సు దృష్టిలో ఆదర్శాన్ని చేరుకోవడానికి ఉపయోగించే సాధనానికి ఏ ప్రాముఖ్యతా లేదు. ఏ సాధనాన్ని ఉపయోగించైనా ఆదర్శాన్ని చేరుకోవటమే ముఖ్యమని ఆయన సిద్ధాంతం. ఆదర్శాన్ని చేర్చే ఏ సాధనమైనా ఉత్తమ మైనదే నని ఆయన నిర్వచనం. మహాత్మా గాంధీ దృష్టి దీనికి విరుద్ధమైంది. ఆయనకు దుష్ట సాధనం ఉన్నతాదర్శం సాధించలేదని ఆయన మనోనిశ్చయం. అందుకని సాధనం

పవిత్రంగా ఉండాలని ఆయన నొక్కి నొక్కి చెపుతుండే వాడు.

నిజమాలోచిస్తే స్థిరమైన ఒకఆదర్శం అనేది లేదని మనం అంగీకరించ వలసిందే. శాస్త్ర వేత్తలు ఈ ప్రపంచ పరిణామం అనంతమని చెపుతూవున్నారు. ఈ ప్రపంచ పరిణామం అనంత మైనప్పుడు స్థిరమైన ఆదర్శ మనేది ఒకటి ఉండటానికి వీల్లేదనేది కూడా వెంటనే అంగీకరించ వలసి వస్తుంది. అందుకనే ఆదర్శం క్షణక్షణం మారుతూ ఉంటుందని వారు చెపుతూ ఉంటారు. క్షణక్షణం మారే వస్తువేదీ నిత్యమైంది కాదు. నిశితంగా చూస్తే ఒకప్పుడు ఆదర్శంగా మనల్ని ఉద్రేక పరచింది తర్వాతి దశకి సాధన మౌతుంది. మన సంగతే ఆలోచించుకొని చూద్దాం. స్వరాజ్యం వచ్చే వరకు మన కది ఆదర్శం. స్వరాజ్యం వచ్చిం తర్వాత సురాజ్యం స్థాపించడానికి స్వరాజ్యంసాధనం. అందువల్ల ఆదర్శం అనే దానికంటే దాన్ని సాధించటానికి వేసుకున్న మార్గమే సత్యమైందనీ, నిత్యమైందనీ మన మనుకోవలసి వస్తుంది. మన జీవితాలు సర్వాంగ శోభితంగా విలసిల్లాలంటే మనం అనుసరించే మార్గాన్ని సుశోభితం చేసుకో వలసిందే. మార్గమే మనకు ఆహ్లాదాన్నిచ్చి ఉత్తేజపరిచేటట్లు చేసుకోవలసిందే. మార్గాని కిరుప్రక్కలా చల్లదనాలనిచ్చే చెట్లనునాటుకుంటూ, సువాసనల నిచ్చే పుష్పాలను అనుభవిస్తూ, పన్నీరు చల్లుకుంటూ వెళ్లవలసిందే. ఆదర్శమనేది ఎక్కడైనా వుంటే అది ఎప్పటి కప్పుడు సాధనలో మిళిత మయ్యే వుంటుందని

మనం చెప్పుకోవాలి. రేపెప్పుడో ఆదర్శాన్ని చేరుకుంటు న్నాం గనుక, దేశాభివృద్ధికి కావలసిన పనులు అప్పుడు చూచుకోవచ్చు, ఈ లోగా మన వ్యామోహాల్ని సంతృప్తి పరచుకోడానికి కాస్త దారి తొలుగుదామంటే కుదరదు. ఆ దారి తొలగిన మీదట మానవుడు పతనమై ఉంటాడు. పతన మైన మానవుడు అధికారానికి వచ్చి వెలగ బెడతాడనుకోవ డం వెర్రి. అధికార వ్యామోహం, మామూలు మానవున్ని రాక్షసునిగా మారుస్తుంది. అందు వల్ల అధికారంలోకి వచ్చే టప్పటికి మానవులు మహర్షులుగా ఉంటేనే అధికారం వల్ల వచ్చే లాభాలను ప్రజానీకం అనుభవించ గలుగుతుంది. ఈ విధంగా ఆలోచించినప్పుడు గాంధీ గారి తాత్విక దృష్టిలోని ఈ లక్షణం ఎంత గొప్పదో మనకు బోధ పడుతుంది.

అధికారానికి రావటానికి ఏ సాధనాన్నైనా ఉపయో గించవచ్చని నిశ్చయించుకుంటే దానివల్ల అసూయ ద్వేషాలు, అనుమానాలు, దుర్భ్రమలు ప్రపంచంలో ఎక్కువౌతాయి. వాటి వలనకలిగిన వాతావరణంలో ఎవరూ యేమంచి పని చేయలేని పరిస్థితి ఏర్పడుతుంది. మనిషిమీద మనిషికి అప నమ్మకం కలిగినప్పుడు ఏ మనిషి కామనిషి ఎదుటివాణ్ణి లోబరచుకోవాలని ఆశించినప్పుడు ఇక పురోగమనానికి చోటేది!

మహాత్మా గాంధీ బ్రతికి ఉన్నన్నాళ్లు, ప్రపంచం ఇటువంటి దుస్థితికి ఆహుతి కాకుండా ఉండ గలందులకు ప్రయత్నించాడు. తన అహింసోద్యమంలో వీలైనంత వరకు

డార్జన్యానికి స్థానం లేకుండా చేశాడు. రహస్యమంత్రాలోచన లకు చోటు లేకుండా చేశాడు. ఏ కార్యక్రమాన్నైనా బహిరంగంగానే చర్చించేవాడు. తానేమి చేయబోతున్నదీ ముందు శత్రువుకు తెలిపే చేసేవాడు. ఎప్పటికప్పుడు ప్రతిమనిషిలోనూ మంచితనం ఉందని నమ్మిన వాడు కనుక విరోధులకు కూడా హృదయ పరివర్తనం కలుగుతుందని ఆశించి అలా కలుగ డానికి పరిస్థితులను సృష్టించేవాడు. "నేనెప్పుడూ రాజీకి సిద్ధమే" అంటుండేవాడు. విరోధిని శిక్షించి భయ పెట్టిందాని కంటే, తనకు తానే శిక్షించుకొని మానవుల మనస్సుల్లో వున్న మంచి తనం పైకొచ్చేటట్లు చేసేవాడు. ఆ మంచితనం విశ్వాన్నంతా వ్యాపించి, భూతలం మీదే స్వర్గాన్ని సృష్టించ గలమని ఆయన విశ్వాసం. ఆయన నడిపిన నిరసన వ్రతాల్లో ని అంతరార్థం కూడా ఇదే నసిపిస్తుంది నాకు.

ఈ విధంగా మార్క్సు తాత్విక దృష్టికి భిన్నంగా మానవుల్లో ఉన్న మంచితనాన్ని అట లోకి తీసుకొన్న తాత్విక దృష్టిని నిర్మించి ప్రపంచాని కొక నూతన సందే శాన్నిచ్చాడు మహాత్మా గాంధీ. ఈనాడు మనం మార్క్సు తాత్విక దృష్టి, మానవుల హృదయాల్లో రేపిన అసమానాన్ని ద్వేషాన్ని, వాటి వల్ల కలిగిన దుష్ఫలితాలనూ చూస్తున్నాం. ఒక్క మనమే కాదు, రష్యా నాయకులు కూడా దీన్ని గమ నించినట్లు ఇటీవల కనిపిస్తున్నది. ఇటువంటి విషమ పరిస్థితుల్లో మానవ కల్యాణాన్ని కోరిన ప్రతి మానవుడూ గాంధీగారి అహింసోద్యమం విశ్వవ్యాప్తం కావాలని కోరుకోవటంలో

సందేహ మేమీ ఉండదని నేననుకుంటున్నాను. తామనుస రిస్తున్న సిద్ధాంతాల అపరిపక్వ స్థితిని గమనించి, అవి తమ సమస్యలను పరిష్కరించ లేవని నిశ్చయించుకొని, పాశ్చాత్య దేశాల నాయకులు మన ప్రధానిని తమ సమస్యా పరిష్కా రాలకోసం తరచు ఆహ్వానించటం మనమందరం చూస్తూనే ఉన్నాం. ఇది శుభ చిహ్నం. మన ఒక్క దేశానికే కాక ప్రపంచానికే వెలుగును చూపించిన మహానాయకుడు మహా త్మా గాంధీ. మన ఉపాధ్యక్షుడు డా. రాధాకృష్ణ చెప్పినట్లు "మహాత్మా గాంధీ గొప్పతనం, ఆయన పడినకష్టాలలో లేదు, ఆయన జరిపిన పోరాటాలలో లేదు. ఆయన సాధించిన విజయాలలో లేదు. ఆయన జీవించిన పవిత్ర జీవితంలో ఉంది". మహాత్మా గాంధీకి మానవుడు దైవాంశ సంభూ తుడు. ఆయనకు మానవుడు ముఖ్యం. పార్టీలు గాని, సం స్థలుగాని, సాధనాలు గాని, మానవునిలో వున్న మంచిని వృద్ధి చేయటానికే కాని అరి కట్టటానికి కాదు. వీటిని అం దుకే వుపయోగించుకోవాలి. కాని వీటికే ప్రత్యేకతా రానివ్వ కూడదు. మహాత్మా గాంధీ విభిన్న వర్గాలకు చెందిన వ్యక్తులను, విభిన్న దృష్టులు కలిగిన వ్యక్తులను ఆకర్షించ గల గటాని కిదే కారణం. మొత్తం ప్రపంచానికి ఆదర్శం కావ టానికికూడా ఇదే కారణం.

ప్రముఖ రాజకీయ వేత్త, దక్షిణాఫ్రికాలో మహాత్మా గాంధీకి ప్రత్యర్థి నాయకుడూ అయిన స్మట్సు మహాత్మా గాంధీని గురించి 'ప్రతి పరిస్థితుల్లోనూ ఆయన అందులో అం తర్లీనమై యున్న మానవత్వాన్ని మరచి పోయేవాడు

కాదు, ఎప్పుడూ అసహనాన్ని చూపేవాడు కాదు. ఎప్పుడూ ద్వేషానికిలోబడే వాడు కాదు. ఎటువంటి విషమ పరిస్థితుల్లోనైనా మనస్సులను రంజింప జేసే తన ఆశయాన్ని వదులుకొనే వాడు 'కాదు' అని చెప్ప గలగ టానికి దే కారణం. ఆయన మానవప్రుడిలో దివ్యత్వాన్ని లేపటానికి ప్రయత్నించాడు. తానూ ఆవిధంగానే అభివృద్ధి చెందాడు. తనను గురించి ఒక ప్రముఖుడు 'రాజకీయాల్లో చేరి పతనమైన ఒక మహర్షి గాంధీ' అని అంటే "అలాకాదు, నేను రాజకీయ వేత్తను, మహర్షి నవటానికి కృషి చేస్తున్నాను, అంతే." అని చెప్పాడు మహాత్మా గాంధీ. ఈ ఒక్క మాట మొత్తం ఆయన నడిపిన వుద్యమాలన్నిటికీ సరియైన అర్థంచెప్పే వ్యాఖ్యానం. మానవత్వాన్ని ఆధారంగా తీసుకుని, మానవాళిని దివ్యత్వాన్ని చేరుకోవటానికి నడిపించిన మహానాయకుడు మహాత్మా గాంధీ. అందువల్లే ఆయన ప్రపంచానికి మహర్షి అయ్యాడు; మార్గం చూపించే దివ్య జ్యోతి అయ్యాడు, ఆయన మనదేశంలో పుట్టి తన వుద్యమాన్ని మన దేశంలో నడిపినందులకు మనమందరం గర్వపడ వలసి వున్నది.

---

# గాంధీజీ రాజకీయ సిద్ధాంతం

## శ్రీ స్వామి రామానంద తీర్థ

ఇవాళ గాంధీజీ రాజకీయదృష్టి మీద ఉపన్యసించవలసిందిగా కోరారు. తర్వాత నాకు గాంధీ రాజకీయ దృష్టిలోని వివిధ రంగాలను స్పృశించవలసిందిగా సూచించబడింది. ఇందులో ఒక కష్టమున్నది. గాంధీ సిద్ధాంతాలనుంచి ఆయన రాజకీయ సిద్ధాంతాలను వేరుచేసి చూడటం కష్ట సాధ్యమైన పని. ఆయన రాజకీయ వేత్తే. అయినప్పటికీ ఆయన రాజకీయ సిద్ధాంతాలు ప్రత్యేకంగా లేవు. ఆయన సిద్ధాంతమంతా ఒక సమన్వయ ఇంటిగ్రేటెడ్ సిద్ధాంతం. కనుక ఈ విషయం మీద ఉపన్యసించడానికి పూనుకునేప్పుడు, ఆయన రాజకీయ సిద్ధాంతాన్ని వేరు చేసి చూపడం నాకు కొంత శ్రమను కలిగించింది. నా కష్టాన్ని మీ ముందుంచాను. గాంధీజీ సిద్ధాంతాలు మొత్తం జీవిత రంగానికి సంబంధించిన సిద్ధాంతాలు. ఆయన తత్వాన్ని తత్వమనడంకంటే ఒక జీవిత విధానమనటం మంచిది. ప్రత్యేక రాజకీయ సిద్ధాంతమంటూ ఆయన రాయనూ లేదు, చెప్పనూ లేదు. అయితే గాంధీజీ

జీవితంలోని రాజకీయను సంగాన్ని మనం ప్రత్యక్షంగా చూడగలిగాం. మన కందరికీ ఆయన రాజకీయ దృష్టి తెలుసు మనకు స్వాతంత్య్రం వచ్చింతర్వాత ఓసారి గాంధీజీయే అన్నారు 'నేను చనిపోయింతర్వాత నాతోపాటు నా రచనలను కూడా దగ్ధం చేయండి' అని. ఆయనకు తన పేరు మీద ఒక సిద్ధాంతాన్ని గాని తత్వాన్ని గాని నిర్మించుకోవాలని లేదు. తన తర్వాత తన పేరు మీద ఒక మతం నిర్మించ బడాలని ఆయన కోరలేదు. అయినప్పటికీ ఆయన పుస్తకాలు, ఆయన పత్రికలలో తరచుగా వ్రాసిన వ్రాతలు, ఆయనకు సంబంధించిన ఇంకా అనేక సాహిత్యం ఆయన సిద్ధాంతాలను తెలుసుకోవడానికి ఉపయోగ పడేదిగా వున్నది. ఈ సాహిత్యం ద్వారా ఆయన సమగ్రమైన జీవిత దృష్టిని మనం తెలుసుకోవచ్చు.

ధర్మమూ రాజకీయమూ వేరుకావు. గాంధీజీ రాజకీయాలు స్పిరిచువలైజుడు రాజకీయాలు. స్పిరిచువలైజుడు అనే పదానికి మీరేవిధమైన అర్థమైనా చెప్పుకోవచ్చు. ఆధ్యాత్మికతను ఆయన రాజకీయాల్లో రంగరించాడని కొందరు వ్యాఖ్యానించుకుంటే, నైతిక స్థాయిని రాజకీయరంగంలో పెంచాడని కొందరు అర్థం చెప్పుకోవచ్చు. కొందరు నైతిక స్థాయికీ ఆధ్యాత్మికతకూ మధ్య భేదాన్నే గుర్తించరు. మరి కొందరీ భేదాన్ని స్పష్టంగా గుర్తిస్తారు. ఏదెలా ఉన్నా గాంధీజీ రాజకీయాలను స్పిరిచువలైజుడు రాజకీయాలుగా నిర్వచించడంలోని సామంజస్యం మాత్రం భంగ పడదు.

గాంధీజీ రాజకీయ దృష్టిలో సాధన మార్గం ప్రాధా

న్యం వహిస్తుంది. ఒక ఉద్దేశ్యాన్ని సాధించడానికి ఆ ఉద్దేశ సాధనకు అవలంభించే మార్గాలను పవిత్రంగా ఉంచుకోవాలి. ఉద్దేశ్యం పవిత్రమైందే కావచ్చు; తమ ఉద్దేశ్యం పవిత్రం కాదని ఎవరు చెప్పుకుంటారు కనుక! దేశాన్ని అభివృద్ధికి తేవడానికి, బీద జనాన్ని ఉద్ధరించడానికే కృషిచేస్తున్నట్లు అందరూ చెప్తారు. కృషిచేస్తారు గూడ. ఐతే ఆవిధంగా పవిత్రమైన ఉద్దేశాలు కలిగి ఉన్నంత మాత్రాన చాలదు. ఆ ఉద్దేశాలను సాధించడానికి అవలంబించే సాధనాలు కూడా పవిత్రంగా ఉండాలి. పవిత్ర ఉద్దేశాలను మాత్రమే కలిగి, సాధనమార్గాల పవిత్రతకు ప్రాధాన్యత నివ్వకపోవటం కేవల రాజకీయపద్ధతి అనిపించుకొంటుంది. ఈ కేవల రాజకీయ పద్ధతిని స్పిరిచువలైజు చెయ్యాలంటే అందులో సాధనమార్గానికి పవిత్రతను ప్రవేశపెట్టాలి. తప్పుడు మార్గాలద్వారా ప్రాప్తమైన స్వాతంత్ర్యం, సంక్షేమం మొదలైన వాటిలో, దేశపు మౌలిక జీవిత విధానంలో పరివర్తనం చెయ్యటం అసాధ్యం. ఇది గాంధీజీ రాజకీయ సిద్ధాంతాల్లోని మౌలిక సూత్రం.

మనం నూతన పథంలో ఒక ముందడుగు వేయ దలచు కొన్నప్పుడు, పాత పద్ధతులను, పాత హంగులను రూపుమాపి క్రొత్త పద్ధతులను ప్రవేశ పెట్టదలచు కొన్నప్పుడు, పాత భవనాలను, పాత సాంప్రదాయాలను కూలద్రోయటం అనే కార్యక్రమం మాత్రమే మనం చేస్తున్న పని. పాత భవ నాలను కూలద్రోయవలసిన అవసరమున్నది. వానివల్ల ఇక లాభం లేదని తేలిపోయింది. పైగా అలాంటి పాత భవనాల

వలన నష్టపడుతున్నట్టుకూడా తేలిపోయింది. ఇక వానిని పడ గొట్టటం తప్ప వేరే మార్గం లేదు. అయితే ఆ విధంగా వానిని పడగొట్టినంత మాత్రానే మన పని అయిపోదు. వానిస్థానే క్రొత్తభవనాలను నిర్మించుకొనే పనికూడా మనం వేయదలచు కున్న ముందడుగులో భాగం కావాలి. చెడ్డ పద్ధతుల వినా శనంతో పాటు మంచి పద్ధతుల నిర్మాణంకూడా మన కార్య క్రమంలో ఉండాలి. కేవలం డిస్ట్రక్షన్‌వల్ల లాభం లేదు. కన్స్ట్రక్షన్ కూడా కావాలి. స్వతంత్రం వచ్చింతర్వాత దేశంలో ప్రజా జీవితాన్ని పునర్నిర్మాణం చేసుకోవడానికి గాంధీజీ నిర్మాణ కార్యక్రమం, ఇచ్చారు. ఆయన వేసిన ప్రతి ముందడుగూ, ముఖ్యంగా దేశానికి స్వతంత్రం వచ్చింతర్వాత, శారీరకంగా అశక్తులై వుండి కూడా మరణించే దాకా నిర్విరామంగా ఆయన చేసినకృషి అంతా దేశ పున ర్నిర్మాణానికి సంబంధించిందే.

గాంధీజీ మూడు విషయాలు మన ముందుంచాడు. రాజకీయ, సాంఘిక, ఆర్థిక ప్రవృత్తులనేవి మూడూ భిన్నమైనవి కావు. ఆయన రాజకీయ ప్రవృత్తికి సంబంధించిన ముఖ్య సిద్ధాంతం వ్యక్తి స్వాతంత్రం— వ్యక్తి వికాసం న్యాయ సాధనం సామాజిక దృష్టిద్వారా జరగాలని ఆయన సిద్ధాం తం. ఇతరుల శ్రమవల్ల తాము బ్రతికే ఆర్థిక శోషణ పద్ధతి తొలగాలి. ఈ విషమత్వం నశించాలి. ప్రకృతి సంబంధమైన విషమత్వంతో మానవుడు ఒక వైపున పోరాడుతూనే ఉన్నాడు. అది ఎలాగూ ఉంది. దాంతో నిత్య సంఘర్షణే

జీవితం. కాని దానితో పాటు ఈ సమాజంలో మానవ నిర్మిత విషమత్వం కూడా ఉన్నది. మనుష్యుడు నిర్మించిన ఈ విష మత్వాన్ని ముందుగా మనం రూపుమాపాలి. గాంధీజీ రాజ కీయ సిద్ధాంతాల్లోని ముఖ్యమైన మూడు సూత్రాలివే. 1. జాతీయ స్వాతంత్ర్యం National Freedom 2. వ్యక్తి స్వేచ్ఛ. Individual Liberty 3. సామాజిక న్యాయం. Social Justice ఈ మూడింటినీ మనం బాగా విచారిస్తే ఆయన సిద్ధాంతాల్లోని విశిష్టత మనకు బోధపడుతుంది. మన భాగ్యంవల్ల ఆయన సిద్ధాంతాల్లోని విశిష్టతను మనకు వివ రించడానికి, గాంధీజీ సిద్ధాంతాలకు ప్రాతినిధ్యం వహించే వినోబాజీ మన కళ్ల ముందర ఉన్నారు. మైనారిటీ, మెజా రిటీ దృష్టిగల ఈ పద్ధతి ప్రజాస్వామ్యం కాదని వినోబాజీ అంటున్నారు. గాంధీజీ కూడా ఈ విషయాన్నే నొక్కి చెప్పారు. ఇప్పుడున్న రాజకీయ పద్ధతి, మెజారిటీ మైనారిటీ ప్రధానమైన రాజకీయపద్ధతి. పార్టీ సహితమైన ఈ ప్రజా స్వామ్యంలో అది అనివార్యమౌతున్నది. మనం ఉంటున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఈ పద్ధతి అనివార్యం కావ టం వల్ల ప్రజాప్రాతినిధ్యం మృగ తృష్ణ అవుతున్నది. ఒక పార్లమెంటరీ నియోజక వర్గంలో ఒక వ్యక్తికి పోటీ చేసి, ఆ నియోజకవర్గంలో ఓటర్లకు ప్రాతినిధ్యం వహిస్తాడని సిద్ధాంత గతంగా ఊహిస్తున్నాం. కాని ఆచరణలో అది సాధ్యపడేది కాదు. దాదాపు ఏడు లక్షల పైన ఓటర్లుగల ఒక నియోజక వర్గంలో పోటీ చేస్తున్న ఒక అభ్యర్థి ఆ ఏడు లక్షల ఓటర్లతో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండటం అసాధ్యం. ఈ పార్లమెం

టరీ ప్రజాస్వామ్యంలో అల్ప సంఖ్యాకులు, అధిక సంఖ్యాకులు అనే దృష్టి రావటం అనివార్యమౌతున్నది. అల్ప సంఖ్యాకుల పట్ల గాంధీజీ విధానం ఏమిటో పరిశీలిద్దాం. సంఖ్యాబలం మీద ఆయనెప్పుడూ అల్ప సంఖ్యాకుల్ని చూడలేదు. అల్ప సంఖ్యాకులు తమ అల్పత్వాన్ని దూరం చేసుకుని, విశాలమైన మానవ సమాజంలో అందరితో బాటు సమాన స్థాయిలో వ్యవహరించాలని అయన ఆశయం. అందుకనే ఆయన అల్పసంఖ్యాకుల పట్ల అత్యంత శ్రద్ధను ప్రేమను ప్రకటించాడు. ఆయన మామూలు మార్గాన్నుంచి వేరై అల్ప సంఖ్యాకుల పట్ల అధికంగా ప్రదర్శించిన ప్రేమను కనుపరుస్తుంటే కొందరికి గిట్టలేదానాడు. కాని ఆయన దృష్టి మాత్రం 'అల్ప సంఖ్యాకులు' 'అధిక సంఖ్యాకులు' అనే భేదాన్ని రూపుమాపాలనే.

గాంధీజీ ప్రజాస్వామ్య దృష్టిలో మైనారిటీ మెజారిటీ భేదం లేదు. మైనారిటీ మెజారిటీ భేదాలతో కూడుకుని ఉన్న నేటి ప్రజాస్వామ్య పద్ధతిలో వ్యక్తి స్వాతంత్ర్యం ఉండదు. కేంద్రీకృత పరిపాలనా విధానంలో వ్యక్తి స్వాతంత్ర్యం మృగ తృష్ణ వంటిది. కేంద్రీయ పరిపాలనా యంత్రాంగం లోని ఒక చిన్న భాగంగా రూపొంది, వ్యక్తి స్వేచ్ఛను కబళించుకోవలసిన పరిస్థితి ఇందులో ఏర్పడుతున్నది. గాంధీజీ రాజకీయ సిద్ధాంతం, అందుకని, వికేంద్రీకృత పార్టీ రహిత ప్రజాస్వామ్యము.

రాజకీయ జీవితం ఆర్థిక జీవితం మీద ఆధారపడి ఉంటుంది. ఆర్థికంగా వెనుకబడ్డ సమాజంలో ప్రజాస్వామ్యం బ్రతక జాలదు. బలం, శరీర బలంతో పాటు ధనబలం, అధికారాన్ని తమ గుప్పిట్లో ఉంచుకుంటుంది. మనం ప్రత్యక్ష్యంగా రెండు సాధారణ ఎన్నికల్లో ధనం నిర్వహించిన పాత్రను పరిశీలించాం. ఓట్లు కొనటం, అమ్మటం జరిగింది. అధికార బలం వినియోగపడ్డది. ఈ పరిస్థితుల్లో మనం అనుకుంటున్న ప్రజాస్వామ్యం ఎలా సాధ్యం? అందుకే గాంధీజీ రాజకీయ స్వాతంత్ర్యంతో పాటు ఆర్థిక స్వాతంత్ర్యం కూడా కావాలన్నారు. పౌరుల్ని స్వావలంబుల్ని చెయ్యాలన్నారు. అంటె తమ జీవితావసరాల కోసం వ్యక్తి ఇతరులపై ఆధారపడకుండా వుండాలని. ప్రజా స్వామ్యాన్ని బ్రతికించుకోవాలంటే దాన్ని ధనం, బలం ప్రభావాల గుప్పిట్లోంచి విముక్తం చేయాలి. సమాజంలో శోషణ (దోపిడి - Exploitation) ఉన్నంత కాలం ఇది అసాధ్యం. ఒక వైపు నుంచి శోషణను రూపుమాపుతూ రెండో వైపునుంచి కేంద్రీకృత రాజకీయాధికారాన్ని తగ్గిస్తూ రావాలి. ఈ రెండు ప్రవృత్తులూ ప్రజాస్వామ్యానికి శత్రువులు.

అధికార వికేంద్రీకరణ జరిగినంత మాత్రాన లాభం లేదు. ఆర్థిక వికేంద్రీకరణ కూడా అవసరం. గ్రామాలు స్వయం సంపూర్ణం కావాలి. అవసరమైతే అయిదూ పది గ్రామాలను కలిపి చిన్న చిన్న స్వయంపోషక సమూహాలను ఏర్పాటు చెయ్యవచ్చు. ఈ విధమైన సంపూర్ణ రాజకీయార్థిక

వికేంద్రీకరణ పద్ధతులకు సంబంధించిన ప్రణాళికలు వేసుకుని, ముందడుగు వేస్తేనే తప్ప ప్రజాస్వామ్యం సురక్షితంగా ఉండదు. గ్రామ పరిశ్రమలు, ఖాదీ పరిశ్రమలు, వాటికి ఏదో సహాయం అనే పేరుతో భిక్షాదానపు ప్రస్తుత విధానం వికేంద్రీకృత ఆర్థిక వ్యవస్థను సాధించలేదు. స్వాతంత్ర్యం వచ్చినతర్వాత మనం వేసుకుంటున్న ప్రణాళికలు గాంధీజీ ఆర్థిక సిద్ధాంతాలకు భిన్నంగా ఉన్నాయి. గ్రామ పంచాయితీలనే పేరు ప్రభుత్వం ఏర్పరుస్తున్న నిర్బల, నిస్సహాయ సంస్థలకూ— గాంధీజీ చెప్పిన గ్రామసంఘాలకూ (Village Republics) ఎక్కడా పోలిక లేదు. అదే విధంగా ఆర్థిక రంగంలో కేంద్రీకృత కర్మాగారాలు మొదలైన వాటికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తూ, గ్రామ, కుటీర పరిశ్రమలకు సహాయమనే పేరుతో గాంధీవాదుల కండ్లు తుడిచే పద్ధతికీ—గాంధీ మార్గానికీ ఎక్కడా పొంతన లేదు. గాంధీజీ సిద్ధాంతాలను అమలు పరచాలంటే వాటిని కొన్ని కొన్నిగా తీసుకుని అమలు పరచటం సాధ్యంకాదు. నేను ముందుగానే చెప్పినట్లు గాంధీజీది సమగ్ర జీవిత సిద్ధాంతం. దాన్ని ముక్కలు ముక్కలుగా చేసి కొంచెం కొంచెం ఆచరించటానికి పూనుకుంటే రెంటికీచెడ్డ రేవడిగతి పట్టుతుంది. అందుకని స్వయం పోషకమైన ఆర్థిక జీవితం గల గ్రామ నిర్మాణపు దారుల్లో పయనించాలి.

వినోబాజీ అప్పుడప్పుడు అంటూ వుంటారు. ఈ 'బజారీ' పద్ధతి నుంచి 'పడోసీ' పద్ధతివైపు మనం పురోగమిం

చాలని. అంటే ఆర్థిక జీవితాన్ని మార్కెట్టు పరం చేసే ఈ వాణిజ్య దాస్యపు ఆర్థిక వ్యవస్థ నుంచి విముక్తులమై పరస్పర సహకారం మీద ఆధారపడే ఆర్థిక వ్యవస్థను నిర్మించుకో వాలి. ఈ మార్కెట్టు లేక ఎక్స్చేంజి ఆర్థిక వ్యవస్థలో చాలామంది కేవలం బుద్ధిబలం మీద, అతి తెలివి మీద బ్రతుకుతున్నారు. శరీర శ్రమ చేసేవారు, ఉత్పత్తికి అసలైన యజమానులు పస్తులు పడుతున్నా ఈ 'బుద్ధి జీవులు' తమ ఆస్తుల్ని అధికారాల్ని పెంచుకుంటున్నారు. శోషణజరుగకుండా బుద్ధిమీద జీవించ గలగటం అసాధ్యం. కనుకనే అందరూ శరీర శ్రమ చేయాలన్నారు గాంధీజీ. అందరినీ స్వావలంబు లను కమ్మని ఆయన ఆదేశించిన ఆదేశంలోని అంతరార్థమిదే. ఆయన అందుకే వికేంద్రీకృత ఆర్థిక వ్యవస్థ గల భారత దేశాన్ని తన కలలో రూపు దిద్దుకున్నారు. పది పన్నెండు గ్రామాలను కలిపి ఆర్థిక స్వయం పోషకం చేయడానికి ఆయన ప్రయత్నించారు.

గాంధీజీ దృష్టిలో, ఆయన స్వప్నాల్లో, పరిపక్వమైన సమాజం యేదంటే రాజకీయాధికారం అతి స్వల్పంగా యెక్కడ ఉంటుందో అది. మార్క్సుకూడా ఈ విధమైన సమాజ కల్పనచేశారు. లెనిన్ Ultimately State Withers అన్నాడంటే ఆయన ఊహించిన సమాజం కూడా రాజకీయా ధికారం స్వల్పంగాఉండేదే అని స్పష్టమాతున్నది. ఈ విధంగా గాంధీజీ ఆదర్శం అతి స్వల్పంగా రాజకీయాధికారం ఉండే పరి

పక్క మానవ సమాజం. కాని మనం నడుస్తున్న దారివేరు. మనదేశం ఆ ప్రక్కను కాక దానికి భిన్నమైన మార్గంలో ప్రయోగ మిస్తున్నది. ఈ కేంద్రీకృత రాజ్య వ్యవస్థను వికేంద్రీకరిస్తేనే రాజ్యాధికారాన్ని తగ్గించడం సాధ్యమవుతుంది. అయితే ఈ రాజకీయ వికేంద్రీకరణం కంటే ముందు ఆర్థిక వికేంద్రీ కరణం జరగాలి.

అసలీ ఎన్నికల పద్ధతే సక్రమమైందికాదు. ఇందులో ప్రజాస్వామ్యం లేదు. ప్రజా కాంక్షల కెక్కడా తావు లేదు. గాంధీజీ ధ్యేయం గ్రామరాజ్యం. ప్రజా ప్రతినిధి అనేవాడు ముందు ఆర్థికంగా స్వయంపోషకుడు కావాలి. అతనికి శోష ణంమీద బ్రతికే అలవాటుండ కూడదు. తర్వాత తనను ఎన్ను కున్న ప్రజల జీవితంతో, తాను ప్రాతినిధ్యం వహించే పౌరుల నిత్య వ్యవహారాలతో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండాలి. ఇది ప్రస్తుత కేంద్రీకృత రాజ్యంలో అసాధ్యం. గ్రామ రాజ్యం లేక వికేంద్రీకృత రాజ్యవ్యవస్థ లోనే ఇది సాధ్యపడు తుంది. ఈ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అవాస్తవమైంది. గ్రామ రాజ్యవిధానంలో మొదట ప్రత్యక్ష ఎన్నికల ద్వారా గ్రామ కమిటీలు ఎన్నుకో బడతాయి. ఆ తర్వాత పరోక్ష ఎన్నికలద్వారా ఆ గ్రామ కమిటీ సభ్యులు రాష్ట్ర, జాతీయ సమితులను ఎన్నుకుంటారు. అధికారం పైనుంచి క్రిందికి కాక క్రిందినుంచి పైకి వెళుతుంది. ప్రత్యక్షంగా ఎన్నుకో బడిన గ్రామ సమితి గాంధీజీ ఊహించిన వికేంద్రీకృత ప్రజా స్వామ్య రాజ్యపు బలమైన విభాగం. పరోక్షంగా ఎన్నుకో

బడే ఇతర సమితులకు సహజంగా దీనికంటే తక్కువ బలం ఉంటుంది. నేను గ్రామ సమితి అంటున్నానంటే ఇవాళ ప్రభుత్వం చేత ఏర్పాటు చేయబడుతున్న గ్రామ పంచాయితీల వంటివి అనుకునేరు! అవి కేవలం ఉత్సవ విగ్రహాలు మాత్రమే.

నేటి పరిస్థితుల్లో గాంధీజీ ఉంటే ఏం చేసేవాడు? అనే ప్రశ్నకు, ఆయన లేరు కనుక, ఎవరికి తోచిన విధంగా వారు సమాధానం చెప్పు కుంటున్నారు. కాని ఆయన బ్రతికి ఉన్నప్పుడు ఆయన కార్యక్రమాలనుచూచి, ఆనాటి పరిస్థితులనూ, ఆయన చర్యలనూ సమన్వయించి చూచినట్లయితే, ఈనాటి పరిస్థితుల్లో ఆయనేం చేసేవారో ఊహించుకోవడం అంత కష్టసాధ్యకాదు. ఈ ప్రశ్నకు నాకు తోస్తున్న సమాధానం ఏమంటే, ఇవాళ వినోబాజీ తీసుకున్న కార్యక్రమాన్నే గాంధీజీ బ్రతికివుంటే తీసుకునే వాడని.

ఆదర్శాన్ని, మనమంటున్న పరిస్థితులనూ సమన్వయించుకుంటూ మనం మన కార్యక్రమాలను నిర్ణయించుకోవాలి. మన ఆదర్శం రమ్యంగా ఉండవచ్చు; కాని మనమంటున్న ఈనాటి మన చుట్టుపక్కల పరిస్థితులను కూడా మనం గుర్తించాలి. ఈ పరిస్థితుల్లో మన ఆదర్శాన్ని చేరటానికి ఎంత సమయం పడుతుందో అంచనా వేసు కోవాలి. అందుకే గాంధీజీ ఎంత ఆదర్శ రాజకీయవేత్తో అంత ఆచరణ

యుత రాజకీయవేత్త. గాంధీజీ సర్దుబాటు చేసుకునేవారు. ఈ సర్దుబాటు గుణం గాంధీలో ప్రత్యేకత. అయితే ఆయనె ప్పుడూ తన సిద్ధాంతాన్ని ఈ సర్దుబాటులో విడనాడ లేదు. రెండో ప్రపంచ సంగ్రామం వచ్చినప్పుడు ఆయన ప్రవ ర్తించిన ప్రవర్తనను ఆయన యొక్క ఈ గుణానికి ఉదాహార ణంగా తీసుకోవచ్చు. కాంగ్రెసు వర్కింగు కమిటీ ఒక విధంగా తీర్మానించింది. ఆయన మరొక విధంగా సిద్ధాంతీక రించుకున్నారు. వర్కింగు కమిటీ తీర్మానానికీ, తన సిద్ధాం తానికీ మధ్య సంఘర్షణ రాగానే తాను తప్పుకోడానికి సిద్ధ మైనాడు. తమ తీర్మానాన్నే చేతబట్టుకుని వర్కింగు కమిటీని ముందుకు సాగ మన్నాడు. తాను మాత్రం రానన్నాడు. ఆచరణలో సిద్ధాంతాన్ని ఏవిధంగా ఆయన ఎన్నడూ విడనాడ లేదో అదేవిధంగా ఆయన తనసిద్ధాంతాన్ని ఆచరణకు ఎన్నడూ అడ్డుతగల్చ లేదు. పాకిస్తాన్ నిర్మాణసమస్య దీనికి ఉదాహారణ. ఈ సమస్యకు ఆయన వ్యతిరేకులు. నా హృదయాన్ని రెండు ముక్కలుచేసి ఆపైన భారత దేశాన్ని విభజించండి అన్నారు. కాని కాగితాలమీాద సంతకాలు పెట్టుకొని, ఒడంబడికలు చేసుకొని నెహ్రూ, పటేలు మొదలగువారు పాకిస్తాన్ నిర్మా ణాన్ని ఒప్పుకుని వచ్చినప్పుడు 'సరే మీా ఇష్టం, ఈ రాజ్యాన్ని మీారే ఏలుకోండి' అన్నారు కాని, అడ్డు తగులలేదు.

వికేంద్రీకృత ప్రజాస్వామ్య ప్రభుత్వ వ్యవస్థ ఏర్పడే దాకా మన దేశానికి క్షేమం లేదు. భారత దేశంలో ఈ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరుతో ఉన్న నియంతత్వం–

నియంతృత్వంఅనేశబ్దం కొంచెంకటువైనదేకావచ్చు, కానిఇదొక విధమైన నియంతృత్వం. మనంఇస్కందర్ మిర్జాను, తన దేశంలో కంట్రోల్డ్ డెమోక్రసీ (నియంత్రిత ప్రజాస్వామ్యం అనేక్రొత్త పేరును సృష్టించినందుకు హేళన చేస్తున్నాం. మన దేశంలోని నియంతృత్వానికి మనంవేక్రొత్త పేరు పెట్టుకోవలసిఉన్నది– దీనికంతకూ కేంద్రీకరణే కారణం. వికేంద్రీకృత ప్రజాస్వామ్యంలో నియంతృత్వం తలెత్తటం సాధ్యపడదు. మన మీం కేంద్రీకృత ప్రజాస్వామ్య వ్యవస్థను మార్చి, వికేంద్రీకృత ప్రజాస్వామ్య వ్యవస్థను నిర్మించుకోవడానికి కృషిచేయాలి. అందుకోసం ముందు మన ఆర్థిక వ్యవస్థను వికేంద్రీకరించాలి. మన దురదృష్టం వల్ల మనకు దొరికిన మన ప్రణాళికా కర్తలు ఆర్థిక శాస్త్ర సూత్రాలు– అవి ధనస్వామ్య ఆర్థిక శాస్త్ర సూత్రాలు నమ్ముకున్న ఆర్థిక వేత్తల దృష్టి వికేంద్రీకరణం వైపు లేదు. దేశాన్ని స్వయం పోషకం వైపు పురోగమింప చేయడానికి ప్రణాళికలు అనే మాటలన్నీ అబద్ధాలు, కేంద్రీకరణం వైపు పురోగమిస్తూ దేశాభివృద్ధి అసాధ్యమయినప్పుడు అవి అబద్ధాలుకాక నిజమవుతాయా? గ్రామ పరిశ్రమలకు మన ఆర్థిక జీవితంలో ప్రముఖ స్థానం ఇచ్చే దాకా ఇది సాధ్యంకాదు. గ్రామ రాజ్యం ద్వారానే రామ రాజ్యం సాధ్యపడుతుంది.

[ఉపన్యాసానంతరం జరిగిన ప్రశ్నోత్తరాలు. ప్రశ్నలకు స్వామీజీ సమాధానం చెప్పారు. తెలుగులో అడుగబడిన ప్రశ్నలను సుమిత్రాలో హిందీలోకి అనువదించు స్వామీజీకి వివరించారు.]

[ప్రశ్న] ఒక వైపు ఇలా కేంద్రీకరణను ఉంచి గ్రామాల నెలా అభివృద్ధి చెయ్యాలి? ఆర్థిక వ్యవస్థను వికేంద్రీకరించటం ఎలా?

[సమాధానం] క్రమ క్రమంగా ఇప్పుడున్న గ్రామ పంచాయితీల అధికారాలను పెంచుకుంటూ పోవాలని, ఈ ఉద్దేశం గల నాయకులు అనుకుంటున్నట్టున్నారు. ఇదింకా ఆలోచనలో ఉన్నది. ఆర్థిక వ్యవస్థను వికేంద్రీకరించేప్పుడు మొత్తం వికేంద్రీకరణ సాధ్యపడదు. విద్యుచ్ఛక్తి, ప్రయాణ యానాలు ముఖ్యమైన కేంద్రీకృత వ్యవస్థ అవసరం ఎలాగూ ఉంటుంది. కాని జీవితావసర వస్తువుల ఉత్పత్తి మాత్రం కేంద్రీకృతం కారాదు.

[ప్రశ్న] పది సంవత్సరాలనుంచీ దేశం కేంద్రీకరణం వేపుకు పురోగమిస్తున్నది. మన మేమో అనుసరిస్తున్నాము. దీన్ని ఎదుర్కోవలసిన అవసరం లేదా స్వామీజీ?

[మనం లొంగుతున్నామని మీ అభిప్రాయం లాగున్నది. మనం లొంగలేదు. సంఘర్షణ ముందు మానసిక సంఘర్షణ లేక సిద్ధాంత సంఘర్షణద్వారా ప్రారంభం కావాలి కదా, అది ఇప్పుడు ప్రారంభమైంది. త్వరలోనే అది కార్యరూపం దాల్చవచ్చు.

[ప్రశ్న] గ్రామాల్లో ఏర్పడే ప్రజాప్రాతినిధ్య గ్రామ సమితిలోని సభ్యులమధ్య ఉత్పన్నమయ్యే అభిప్రాయ భేదాల్ని ఎలా తొలగించటం?

[సమాధానం] ఏకగ్రీవంగా అన్ని నిర్ణయాలూ నిజంగానే సాధ్యం కావు. కాని ఏకగ్రీవ నిర్ణయానికి దగ్గరగా తీర్మానానికి రావచ్చు. ఉదాహరణకు వంద మందిలో 95 మంది ఒక విషయాన్ని ఒప్పుకొని అయిదుగురు వ్యతిరేకించారనుకోండి. ఆ అయిదుగురినీ ఒప్పించడానికి మిగతా 95 మందీ ప్రయత్నించాలి. ఆ అయిదుగురి అంగీకారం పొందజాలక పోతే ఆ సమితి రాజీనామా ఇవ్వాలి? కాని ఇలా రాజీనామా ఇవ్వటం ముఖ్యమైన సమస్యల్లోనే జరగాలి. చిన్న చిన్న సమస్యల్లో ఆ ఐదుగురి అంగీకారంకోసం సమయం ఇవ్వబడవచ్చు. పని ప్రారంభించిన తర్వాత దాని ఫలితాలను బట్టి అంగీకరించడానికి ఆ అయిదుగురికి అవకాశం ఇవ్వవచ్చు. ఫలితాలను చూచింతర్వాత కూడా ఆ 5 గురు అంగీకాకరానికి రానప్పుడు ఈ గ్రామ సమితి రాజీనామా ఇవ్వ తప్పదు.

---

కమ్యూనిస్టుల దృక్పథంలో గాంధీజీ

## శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య

సామాన్య ప్రజల దృష్టిలో గాంధీజానికి కమ్యూనిజానికి ఉత్తర దక్షిణ ధృవాలకున్నంత దూరముందని, గాంధీజం అహింసావాదాన్ని అవలంబిస్తే కమ్యూనిజం హింసావాదాన్ని నమ్ముతుందని, గాంధీవాదులు ఆధ్యాత్మిక వాదులయితే, కమ్యూనిస్టులు భౌతిక వాదులని భావించ బడుతూంది.

దేశంలోని రాజకీయ జీవితంలో కూడా గాంధీ రాజకీయాలకు కమ్యూనిస్టు రాజకీయాలకు హస్తిమశ కాంతార భేదముందని, అసలు మన దేశంలో కమ్యూనిజానికి తావే లేదని కూడా భావించబడుతూంది.

అలాంటప్పుడు గాంధీ భవనంలో గాంధీ జ్ఞానమందిరం వారి అధ్వర్యాన జరిగే ఈ సభలో నన్ను ఉపన్యసించమని అడిగినపుడు కొంచెం తటపటాయించాను. అయినా ఈ సమితివారు నాకిచ్చిన ఈ అవకాశాన్ని వినియోగించుకొని

మరొకసారి ఈ విషయాన్ని మననం చేసుకొనే అవకాశం కలిగింది. నేను వెలిబుచ్చే అభిప్రాయాలు ఈ విషయంపై ఇక ముందు జరుగబోయే చర్చలకు ప్రాతిపదికగా వుంటాయనే ఉద్దేశంతో ఈ సమావేశంలో ప్రసంగించటానికి అంగీకరించాను.

1925—1930 సంవత్సరాల మధ్య కాలంలో ప్రజాసేవ చేయాలని, దేశసేవ చేయాలని నాలో ఉత్సాహం కలిగిందంటే అది గాంధీగారి రచనలను, వ్యాసాలను చదవటం వల్లనే. అలా చెప్పుకోవటానికి నేను గర్విస్తున్నాను కూడా. నిజానికి కమ్యూనిస్టు పార్టీలో అనేకమంది ఆయన రచనలను చదవటం ద్వారానే ఉత్తేజితులయ్యారు. ఆ అయిదు సంవత్సరాల్లో ఖద్దరు గురించీ, అస్పృశ్యతా నివారణ, హిందూ—ముస్లిము ఐక్యత, స్వదేశీ ఉద్యమం గురించి సత్యాగ్రహం గురించి, మద్యపాన నిషేధం గురించి, ఒక టేమిటి ఆయన వ్రాసిన రచనలన్నీ చదివాను.

కాని 1930 నాటికి కొన్ని అనుమానాలు పొడసూపటం ప్రారంభించాయి. గాంధీగారి పద్ధతులద్వారా, గాంధీగారి విధానాలద్వారా దేశ స్వాతంత్ర్యం సాధించ గలిగినా నూటికి తొంబదిమందిగా ఉన్న కార్మిక, కర్షక, మధ్యతరగతి ప్రజల ప్రభుత్వంగా వుంటుందా? లేక నూటికి 10 మందిగా వున్న పెట్టుబడిదారుల, భూస్వాముల ప్రభుత్వంగా వుంటుందా? ఒకవేళ స్వాతంత్ర్యం సిద్ధిస్తే అది బ్రిటిష్ సామ్రాజ్య

వాదులతోనో, లేక భారత పెట్టుబడిదారులతోనో రాజీ పడటంద్వారా వచ్చే స్వాతంత్ర్యమే అవుతుందేమోనని అనుకోవటం జరిగింది.

1948లో గాంధీజీ చనిపోయే వరకూ ఆయనతో మాకు అనేక విషయాల్లో భేదాభి ప్రాయాలువుంటూ వచ్చాయి. అయినా వారి వ్యాసాలను శ్రద్ధతో చదివే వాళ్ళం.

1928 లో నేను బాలభట సంఘంలో వుండేవాణ్ణి. కాని గాంధీజీ సభలకు వెళ్ళటానికి ఎప్పుడయితే నాకు అభ్యంతరం కలుగజేసారో అపుడు ఈ సంస్థ సామ్రాజ్య వాదులకు అనుకూలమైన సంస్థ అని భావించి ఇక ఒక క్షణంకూడా అందులో ఉండకూడదని ఇవతలకు వచ్చేశా. ఆవిధంగా గాంధీగారి రాజకీయాలకు దగ్గరగా వచ్చా.

ఒక ప్రక్క గాంధీగారి సిద్ధాంతాలను చదివి వాటిని ఆచరించాలని ప్రయత్నంచేశా. రెండవ ప్రక్క ఈ గాంధీ గారి సిద్ధాంతాలు ప్రజా ఉద్యమాలను ముందుకు పోనివ్వకుండా పట్టి ఉంచుతాయని భావిస్తూవచ్చా. ఇటువంటి రెండురకాల అనుభవాలు దృష్ట్యా గాంధీవాదం గురించి మళ్ళీ ఆలోచించుకొని ఈరోజున అభిప్రాయాలను వెల్లడించటానికి అవకాశం కలిగింది.

నూరు సంవత్సరాల సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో స్వాతంత్ర్యం కొరకు కృషిచేసిన వారిలో గాంధీజీ

అందరికన్నా అగ్రగణ్యుడు, ముందున్న మహావ్యక్తి.

గాంధీజీకి ముందు దాదాభాయ్, గోఖలే, రనడే, తిలక్ మొదలగు మహామహులు కాంగ్రెసు సంస్థకు పునాదులువేసి పనిచేసిన వారున్నారు. కొంతమంది ఉద్యోగస్థులను, అధికారులను భయోత్పాతం కలుగచేయటంద్వారా వారిని తరిమివేయగలమని, అనుకొన్న 'టెర్రరిస్టు' లున్నారు. ఆ తరువాత కార్మిక రైతు ఉద్యమాలు అనేకం నడిచాయి. ఆ తరువాత కమ్యూనిస్టుపార్టీ ఏర్పడి ప్రజలలో పనిచేస్తూ వచ్చింది. ఈ మహావ్యక్తులు, ఉద్యమాలు స్వాతంత్ర్య సముపార్జనలో ముఖ్యపాత్ర వహించాయి. కాని వీరందరికన్నా, ఈ ఉద్యమాలన్నిటి కన్నా తలమానికంగా గాంధీజీ ఉంటూ వచ్చారు. గాంధీజీలో వున్న ప్రత్యేకత ఏమిటి? ఇలా తలమానికంగా ఉండటానికి కారణ మేమిటి?

సామాన్య ప్రజల్లో చైతన్యాన్ని కలిగించి వారందరను కూడా పాల్గొనటానికి వీలయ్యే ఒక కార్యక్రమాన్ని ఇచ్చి ముందుకు నడిపించటంలోనే గాంధీజీ గొప్పతనం ఉంది.

మనము సాధించిన స్వాతంత్ర్యం గాంధీజీ కలలుకన్న స్వరాజ్యమేనా? ఒకరిని మరొకరు పీడించే, ఒక వర్గాన్ని మరొకవర్గం దోచుకొనే వ్యవస్థకు స్వస్తిచెప్పి సామాన్య ప్రజలకు పూర్తి స్వాతంత్ర్యాన్ని ఇచ్చిన స్వరాజ్యమేనా? ఈరోజున కాంగ్రెసు అగ్రనాయకులు నిర్వచిస్తున్న సహకార సర్వోదయ సోషలిజమేనా ఈ స్వరాజ్యం?

స్వాతంత్రం సంపాదించడానికి, గాంధీజం పునాదులు వేసింది. స్వాతంత్ర్యం అనే మన ఆశయాన్ని సాధించటంలో గాంధీజీయొక్క ప్రముఖ పాత్రను కమ్యూనిస్టులు గుర్తిస్తారు. కాని అంతవరకు మాత్రమే. గాంధీజీ సిద్ధాంతాలు అంతకు మించి ముందుకు పోవటానికి తోడ్పడవు.

కమ్యూనిస్టు పదజాలం వివరించాల్సివస్తే సమాజం అంతా వర్గాలుగా విభజించబడి వుంది. భారతదేశంలో కూడా బూర్జువావర్గం, గ్రామాల్లో భూస్వామ్యవర్గాలేకాక కార్మికులు, రైతులు మధ్యతరతి ప్రజలు ఉన్న వర్గంగా విభజింపబడి వున్నాయి. స్వాతంత్ర్య పోరాటంలో అన్ని వర్గాల వారూ పాల్గొన్నారు,

ఈ పోరాటానికి వ్యక్తులుగా ఎవరు నాయకత్వం వహించారనేది చూచి నట్లయితే మొదట గాంధీజీ తరువాత నెహ్రూ అని చెప్పవచ్చు. కాని వర్గరీత్యా చూస్తే బూర్జువా వర్గం లేక ధనిక వర్గం అని చెప్పాల్సి వస్తుంది. ఇతర వర్గాలు కూడా స్వాతంత్ర్యం కోసం కృషిచేశాయి. కాని నాయకత్వం ప్రధానంగా బూర్జువా వర్గానిదే.

దేశాన్ని స్వాతంత్ర్యం వైపుకు తీసుకొని పోవటంలో నైతేనేమి ప్రజల నందరినీ పోరాటంలోకి సమీకరించటంలో నయితేనేమి గాంధీజీ సిద్ధాంతాలు ప్రాముఖ్యత వహించాయి కాని ఆ సిద్ధాంతాచరణకు పరిమితులున్నాయి. విదేశ పెత్త

నం తీసుకోనిరావటానికి, మాత్రమే పరిమితమైంది; కాని నూటికి 90 మందిగావున్న సామాన్య ప్రజానీకానికి నిజంగా స్వాతంత్ర్యం కలుగ చేయటానికి ఈ సిద్ధాంతాలు చాలవు.

నే నిదివరకే చెప్పినట్లు గాంధీజీ సామాన్య ప్రజానీకానికి అందు బాటులో ఉండే కార్య క్రమాన్ని ఇవ్వటం జరిగింది.

మన దేశంలో మాలలను దూరంగా అంటరాని వారుగా చూచినట్లే దక్షిణాఫ్రికాలో కూడా తెల్లవారు నీగ్రోలను, తదితర రంగుజాతుల వారిని దూరంగా ఉంచే వారు. ఈజాతి విద్వేష విధానాన్ని రూపుమాపి సమానత్వం సాధించడానికోసం గాంధీజీ సంత్యాగ్రహ సహాయ నిరాకరణ రూపాల్లో పోరాటం సాగించారు. హృదయ పరివర్తనద్వారా సాధించాలన్నారు గాంధీజీ. ఆ పోరాటంలో అనేకమంది పాల్గొన్నారు.

అలాగే 1917 లో భారతదేశంలో మొదటిసారిగా బీహారులోని చంపరాన్‌లో బ్రిటిష్ తోటయజమానులకు వ్యతిరేకంగా నీలి ఆకు రైతుల పోరాటం (Indigo Struggle) నడిపారు

ఆ తరువాత జరిగిన సత్యాగ్రహ పోరాటాలు ముఖ్యంగా 1920–22, 1930–34, 1940–45 సంవత్సరాల్లో మూడుదశల్లో జరిగాయి.

1920–22 లో సత్యాగ్రహ పోరాటం ఉచ్ఛస్థాయికి పోతున్నపుడు హింస జరిగిందని, ఇది అల్లకల్లోలలానికి దారి తీస్తుందనే పేరుతో ఇంకా ముందుకు పోగలిగిన పోరాటాన్ని విరమింపచేయటం సరికాదని నాడూ నేడూకూడా మా అభిప్రాయం.

తిరిగి 1930–31 సత్యాగ్రహ పోరాటాన్ని గాంధీ–ఇర్విన్ ఒడంబడిక జరిగిన తర్వాతకూడా విరమింప చేయటం సరికాదని మా అభిప్రాయం. మళ్లీ మన బలాలను సమీకరించుకొనటానికి తాత్కాలికంగా విరమిస్తే సరిగాఉండేది. అదికూడా ప్రజల కనుకూలమైన షరతులతో విరమించి ఉండాల్సింది.

అయితే 1924 లో 1934 లోను అంతకుముందు జరుగుతూ వచ్చిన పోరాటాలు విరమించటం సరిఅయినదే నని నా అభిప్రాయం. ఆ రోజుల్లో మన ఉద్యమం బలహీన పడినప్పుడు, శత్రువుదే పై చేయిగా వున్నప్పుడు విరమించడ మొకటేమార్గం.

ఈ విధంగా 1921, 1931 సంవత్సరాల్లో ఉద్యమాలు ఉచ్ఛస్థాయిలో వున్నపుడు పోరాటాలు విరమించటం అంటే ఆ ఉద్యమాలకు పరిమితులు పెట్టడమే అవుతుంది. అయితే ప్రాథమిక దశల్లో ప్రజల్లో చైతన్యం కలిగించి కదలించటానికి మాత్రమే ఈ సత్యాగ్రహ పోరాటాలు ఉపకరించాయి.

వెనుకబడి తలెత్తుకోలేని ప్రజానీకాన్ని వాసు పాల్గొన గలిగి నటువంటి కార్యక్రమం ఇవ్వటమే ఈ పోరాటాల ప్రాముఖ్యత.

1945 నాటికి రెండవ ప్రపంచ సంగ్రామం ముగిసి ప్రపంచ పరిస్థితులు మారాయి. బ్రిటిష్ సామ్రాజ్య వాదులు బాగా బలహీనపడ్డారు. దేశంలో ఆజాద్ హింద్ ఫౌజ్ పోరాటం, అనేక రాష్ట్రాలలో కార్మిక, కర్షక, పోరాటాలు, స్వదేశ సంస్థానాలలో తిరుగుబాట్లు, ఆఖుకు సాయుధ బలాలలో కూడా తిరుగుబాట్లు– ఇవన్నీ బ్రిటిష్ సామ్రాజ్య వాదాన్ని బలహీనపరచి, వారు స్వతంత్రం ఇచ్చేలా చేయటానికి దారితీశాయి.

అయితే స్వరాజ్యం వచ్చినా బ్రిటిష్ వారి ఆర్థిక పెత్తనం అలాగే వుందని, ఆర్థిక పెత్తనం అలాగే వున్నంత కాలం అది సంపూర్ణ స్వరాజ్యం కాదనే మీమాంసలు వుండనే వున్నాయి.

ఆర్థిక ప్రాబల్యం వున్నా, నేటి ప్రపంచ పరిస్థితుల దృష్ట్యా బ్రిటిష్‌వారు భారతదేశాన్ని తామనుకొన్నట్లు తమ పిడికిలిలో వుంచుకోలేక పోయారు.

కాగా కేవలం గాంధీగారి అహింసా సిద్ధాంతాలతో ఏకీభవించనివారు కూడా స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు. అలాగే మనకు స్వాతంత్రం వచ్చిందంటే ఆనాటికి

ప్రపంచ పరిస్థితుల ప్రాబల్యం కూడా లేకపోలేదు.

కేవలం కాంగ్రెసుపార్టీ కృషివల్లనే స్వాతంత్రం వచ్చిందనటంకూడా సత్యదూరం. అయితే కాంగ్రెసుపార్టీ యొక్క ప్రాముఖ్యం ఉందని మాత్రం అంగీకరిస్తాం.

మహాత్మా గాంధీ నిరంతరం హిందూ-ముస్లిం ఐక్యత కోసం కృషిచేస్తూ వచ్చారు. ఆఖరుకు ఆ కృషిలోనే ఒక హిందూ మతోన్మాది చేతిలో తుపాకి కాల్పుకు బలి అయ్యారు. ఈరోజున భారత-పాకిస్తాన్ దేశాలను హిందూ, మహమ్మదీయ రాజ్యాలుగా ఒకరికి వ్యతిరేకంగా మరొకరిని సామ్రాజ్యవాదులు రెచ్చగొడుతున్న ఈ సందర్భంలో గాంధీజీయొక్క ఈ కార్యక్రమం ఎంతేని ప్రాముఖ్యం వహిస్తుంది. గాంధీజీయొక్క ఈ ఆశయం ఇంకా మనం చేరుకోలేదు.

గాంధీజీయొక్క ఈ కృషి చాలా ముఖ్యమైనది. కేవలం అంటరానితనం పోగొట్టడమే కాక ఏకులంలో పుట్టినా సమానత్వం వుండాలని, సాంఘిక సమానత్వానికి భిన్నమైన ఈ పరిస్థితి తొలగించాలని గాంధీజీ అవిరళకృషి చేశారు.

స్వతంత్రం వచ్చిన అనంతరం రాజ్యాంగ చట్టంద్వారా తదితర చట్టాలద్వారా ఈ అంటరాని తనాన్ని పోగొట్టడానికి కృషిజరిగింది. కాని తొలగలేదనే చెప్పాలి.

హోటళ్ళలోను, దేవాలయాలలోను ప్రవేశానికి ప్రయత్నాలు జరిగాయి. కాని ఆర్థిక అసమానత తొలగ సన్నాళ్లూ ఈ సమస్య అపరిష్కృతంగానే వుంటుంది.

మనదేశం ప్రధానంగా వ్యావసాయక దేశం. వ్యవసాయం ప్రధాన వృత్తిగా పెట్టుకొని జీవిస్తున్న వారికి గ్రామ పరిశ్రమలనేవి తీరిక సమయాల్లో మరికొంత ఆదాయాన్ని ఇస్తాయనేటంతవరకూ అంగీకరిస్తాం.

కాని గ్రామపరిశ్రమల ద్వారానే, ప్రధాన భారీ పరిశ్రమలు లేకుండానే దేశం ముందుకు పోతుందనే ఆర్థిక సిద్ధాంతంతో అంగీకరించలేము. పరిశ్రమల వికేంద్రీకరణ జరగాలని, భారీ పరిశ్రమలు మన నాగరికతకు గొడ్డలిపెట్ట వాదనతో మేము ఏకీభవించలేము.

కాని గ్రామ పరిశ్రమల వెనకాలనున్న స్వదేశీ తత్వంతో అంటే మనదేశం స్వయం పోషకంగా వుంటూ మనదేశంలో తయారయే వస్తువులను ఉపయోగించుకోవాలనే దానితో మేము పూర్తిగా ఏకీభవిస్తాం.

కమ్యూనిస్టులు భౌతిక వాదులు కాబట్టి నిరాడంబర జీవనానికి వ్యతిరేకులని చాలమంది అభిప్రాయం. గాంధీ అంత నిరాడంబరంగా ప్రతీపార్టీ, కార్యకర్త నిరాడంబర జీవితం గడపాలి. అలా చేయకపోతే ప్రజలతో సజీవ సం

బంధాలు పెట్టుకోలేం.

ఈ విషయంలో మాకన్నా కాంగ్రెసు వాదులే గాంధీ సిద్ధాంతాలను ధిక్కరిస్తున్నారు. కొద్దో గొప్పో మేమే ఆయన సిద్ధాంతాలకు దగ్గరగా ఉన్నాం? అయితే ఇంకా కృషి చేయాల్సివుంది.

ప్రజలు మద్యాన్ని సేవించి తాగి తందనాలాడాలని డబ్బు వృధాచేయాలని కమ్యూనిస్టులు కోరటంలేదు. అంత వరకూ మద్యనిషేధ సిద్ధాంతంతో అంగీకరిస్తాం. అయితే నిర్బంధంగా ఆ సిద్ధాంతాన్ని అమలు పరచటం అవివేకం. ఈరోజున మనం చూస్తున్నట్లుగా అది మరింత ప్రమాదమైన పానీయాలు త్రాగటానికే దారితీసింది. పరిస్థితుల్లో మార్పు తీసుకొని రావటం ద్వారానే మద్యనిషేధాన్ని జయప్రదంగా అమలు జరుపగలుగుతాం.

వందల వేల యకరాలుగల భూస్వాములు, లక్షల కోట్ల ఆదాయంగల పెట్టుబడిదారులు ఈ ఆస్తులన్నింటికీ తామే యజమానులమని అనుకోకుండా ప్రజలకు ధర్మకర్తృత్వం వహించి, ఆ డబ్బు ప్రజలకోసం, దేశంకోసం వినియోగించాలనేదే గాంధీ గారి ధర్మకర్తృత్వ సిద్ధాంతం. ఈ సిద్ధాంతంతో మేమెన్నడూ ఏకీభవించలేము.

ఈ రోజున ఉత్పత్తి సాధనాలు వారి చేతులలో వున్నాయి. వాటిని స్వలాభంకోసం వినియోగించుకొంటున్నారు. దాన్ని వ్యతిరేకించి పోరాడక తప్పదని మేము భావిస్తాం.

భారీ లాభాలు తగ్గించకుండా, వారి ఆస్తులు తగ్గించకుండా, వారిలో హృదయ పరివర్తన తీసుకుని రావటం అసంభవం. ఉద్యమానికి పరిమితులు పెట్టడం అవుతుంది.

స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న రోజుల్లో ఈ వర్గాలుకూడా పోరాటంలో కొంతవరకూ కలిసి వచ్చారు కాబట్టి అప్పుడు వారికి వ్యతిరేక పోరాటం కొంత పదును తగ్గించారంటే అర్థం చేసుకోవచ్చుగాని స్వాతంత్ర్యానంతరం అటువంటి దృక్పథం అవలంబించటం యెంతమాత్రం సమర్థనీయంకాదు. దీనినే మేము వర్గపోరాటం అంటాం.

అయితే దీని అర్థం ఈరోజున కమ్యూనిస్టులు సాయుధ పోరాటం కావాలంటున్నారని మీరెవరైనా సాగదీసి అర్థం తీశారంటే మాకు అన్యాయం చేసినవారవుతారు.

హృదయ పరివర్తనద్వారా లొంగితే మంచిదే. కాని వారి సౌకర్యాలను కాపాడుకోవడానికి దౌర్జన్యానికి దిగితే ఆ దౌర్జన్యానికి లొంగటంద్వారా, ఒక చెంపమీద కొడితే మరొక చెంపకూడా ఇవ్వటంద్వారా హృదయ పరివర్తన కలుగుతుందా? లేక పెత్తందారీ వర్గాలు దౌర్జన్యానికి దిగి

నపుడు ఆత్మరక్షణకు పూనుకోనటంద్వారా హృదయ పరివర్తన చేయగలమా?

మార్పు శాంతియుతంగా జరగాలనేదే మా వాంఛ. అనేకమంది చనిపోవటాన్ని బుర్రిలు బ్రిద్దలు కావటాన్ని ఎవరు వాంఛిస్తారు?

పెట్టుబడిదారులు భూస్వాములు దౌర్జన్యానికి దిగే అవకాశం, సాహసం లేకుండా చేయాలనేదే మా ఉద్దేశం.

ఈ రోజునవున్న పరిస్థితుల్లో భారత దేశం సోషలిజం కోరుతున్న పరిస్థితుల్లో పెట్టుబడిదారుల, భూస్వాముల అధికారం పోవాలని ప్రజలే ముందుకు వస్తున్నపుడు ధనిక వర్గాలు దౌర్జన్యానికి పూనుకోవటం కష్టం. వారు వెనుకంజ వేయవచ్చు. వారు దౌర్జన్యం చేయునపుడు ప్రతి దౌర్జన్యం చేయాల్సిన అవసరం లేకుండా పోతుంది.

అలా కాకుండా ఎక్కువ మంది ప్రజలు దోపిడీ విధానము పోవాలని వాంఛించినపుడు, అలాకాదు దౌర్జన్యం చేసి దోపిడీ విధానాన్ని కాపాడు కుంటామంటే దానికి ఆ ప్రజలే సమాధానం చెపుతారు.

వారు ఎన్ని దౌర్జన్యాలు చేసినా ప్రజలు అలాగే పడివుంటారని మేము చెప్పటంలేదు.

దాన్ని మరో కోసకులాగి మేము హింసను కోరుతున్నామని చెప్పడం అపార్థాలు చెప్పడమే అవుతుంది.

టెండుల్కర్ వ్రాసిన గాంధీజీ చరిత్రలో 'గత 20-30 సంవత్సరాలుగా జరిగిన పోరాటం అహింసా సిద్ధాంతాలను నమ్మి జరిగిన పోరాటంకాదు. మరో మార్గము లేక, బల హీనముగానున్న ప్రజాశక్తులు సాగించిన సాత్వికనిరోధం (Passive Resistance) మాత్రమే' నని గాంధీ వ్రాసిన లేఖను పేర్కొన్నారు. ఆ విషయాన్ని ఇక్కడ మీకు గుర్తుకు తీసుకొని వస్తున్నా.

గాంధీ దేశానికి ఏమీచేయలేదని, ఆయన ప్రవచనాలనుంచి నేర్చుకొని ఆచరించే దేమీలేదని మేము అనుకోవడంలేదని నేను వేరే చెప్పనవసరంలేదు.

గాంధీజీ ధనికవర్గాలకోసం పనిచేస్తున్నాడని మేము ఇదివరకు బండగా చెపుతూ వచ్చాం. ఇదితప్పు.

కాని ఆయన పెట్టిన పరిమితులవల్ల అవలంబించిన కొన్ని పద్ధతులవల్ల ఆయన అనుకొన్నా అనుకోక పోయినా ధనికవర్గాల ప్రాబల్యం, పెత్తనం అలాగే ఉండిపోవడం జరిగింది.

సమానత్వం అనేది గాంధీ సిద్ధాంతాల్లో కీలకం.

దక్షిణాఫ్రికాలో తెల్లవారితో స్త్రీలకు సమాన

త్వం, చంపారన్‌లో రైతుల సమానత్వంకోసం, విదేశాలతో భారతదేశం [illegible] కులాలవారి సమానత్వంకోసం, హిందూ-ముస్లిం సమానత్వంకోసం, ఆర్థిక అసమానతలు తొలగించి సమానత్వం సాధించటం కోసం మొత్తం ఆయన జీవితం అంతా సమానత్వం కోసం పోరాడారు. సమానత్వం అనేది ఆయన నడిపిన ఉద్యమాలన్నిటికీ బీజం, కీలకం.

ఈ సమానత్వం సాధించాలనే కర్తవ్యం ఇంకా మిగిలివుంది. దాన్ని సాధించాలి. అలాచేసినపుడే గాంధీజీ ఆశయాలను నెరవేర్చిన వారమవుతాం.

పూర్తి సమానత్వం సాధించటం మాట అటుంచి హెచ్చు తగ్గులు సాధ్యమయినంత వరకైనా తగ్గించాలి. భూమిపై, ఇతరాదాయాలపై సీలింగ్ విధించటం ద్వారా గాంధీజీ సిద్ధాంతాన్ని కొద్దిగానైనా ఆచరించినట్లవుతుంది. ఇది రెండవ కర్తవ్యం.

గాంధీజీ శాంతి కావాలన్నారు. ప్రపంచంలో కొన్ని దేశాలు ముఖ్యంగా అమెరికా, బ్రిటిషు సామ్రాజ్య వాదులు యుద్ధాన్ని రెచ్చగొడుతున్నారు. వారిని వ్యతిరేకించి ప్రపంచ శాంతిని కాపాడటానికి కృషిచేయటం హిందూ-ముస్లిం ఐక్యత, కులతత్వాలను తొలగించటం కూడా గాంధీ ఆశయాలను అమలు జరపడానికి చేసే కృషి తే.

ఇలా చేసిననాడే ప్రజల సౌభాగ్యం, దేశ సౌభాగ్యం, మానవ కళ్యాణం సాధ్యమవుతాయి.

చైనాలో సన్-యట్ సేన్‌ను కమ్యూనిస్టుపార్టీ ఎంతో గౌరవిస్తుంది. కమ్యూనిస్టుపార్టీ ఆయన అభిప్రాయాలన్నిటినితో ఏకీభవించక పోయినా ఆయన దేశాభివృద్ధికి ఒకానొక దశలో శాయశక్తులా కృషి చేశారు. ఆయనను కమ్యూనిస్టుపార్టీ తలమానికంగా ఎంచుతోంది. ఎన్ని లోపా లున్నా, ఎన్ని పరిమితులున్నా అటువంటి వారిని గౌరవించి వారి ఆశయాలను ముందుకు తీసుకొని పోవటం సత్సాంప్రదాయం. అలాగే మహాత్మా గాంధీని వారి సేవనూ గుర్తించి వారిని గౌరవించాలి.

శ్రీ సుందరయ్యగారు 1-30 గంటలు ప్రసంగించిన తరువాత సభాసదులు కొన్ని ప్రశ్నలు వేశారు.

ప్రశ్న: ఒక ప్రక్క ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని వ్యతి రేకిస్తున్నారు; రెండో ప్రక్క జాతీయ బూర్జువా వర్గంతో కమ్యూనిస్టులు చేతులు కలుపుతున్నారు. రెండింటికీ తేడా వుందా?

జవాబు: జాతీయ బూర్జువా వర్గంలో చిన్నా పెద్దా వర్గాలున్నాయి. ఇద్దరుకూడా బీదవారిని పీడిస్తూవుండవచ్చు కాని వీరిలో చిన్న, మధ్యతరగతి పెట్టుబడిదారులను బడా

పెట్టుబడిదారులు సామ్రాజ్యవాదులు దోచుకొంటున్నారు. ఆర్థిక కీలకాలు ఈ బడా పెట్టుబడిదారుల చేతిలో వున్నప్పుడు కార్మికులతోపాటు చిన్న మధ్యతరగతి పెట్టుబడిదారులు కూడా నలిగిపోతారు. కాగా వీరినికూడా కలుపుకొని రావటం అవసరం. వీరు చేసే దోపిడీని వ్యతిరేకిస్తూనే వారిని కలుపుకొని రావటం అవసరం.

అయితే బిర్లాలు, టాటాలు కొత్తగా పరిశ్రమలు స్థాపిస్తామంటే మీరు అడ్డు పెడ్తారా? అని మరొకరు ఉప ప్రశ్న వేయగా 'పరిశ్రమలు స్థాపించటాన్ని ఆహ్వానిస్తాం. కాని వారి లాభాలకు కొన్ని పరిమితులను పెట్టాలని కోరుతాం' అని అన్నారు.

దీనికి ధర్మకర్తృత్వానికి చాలా తేడావుంది.

ప్రశ్న: గాంధీజీ ఆశయాలను తామే ముందుకు తీసుకొని పోతున్నామని కాంగ్రెసు వారంటున్నారు. మరి కమ్యూనిస్టుపార్టీ ప్రత్యేకత ఏమిటి?

జవాబు: కాంగ్రెసుపార్టీ నిజంగా దేశంలో సమానత్వాన్ని సాధిస్తే కమ్యూనిస్టుపార్టీ ప్రత్యేకత ఏమీవుండదు. కాంగ్రెసుపార్టీ అలా చేయలేనపుడు కమ్యూనిస్టులే అలా చేయ గలిగినపుడు వారిప్రత్యేకత ఉంటుంది.

ప్రశ్న: 'భూదానం' గురించి మీ అభిప్రాయమేమిటి?

జవాబు: భూమి సమస్య, "భూదాన" ఉద్యమము ద్వారా పరిష్కారము కాదని మా అభిప్రాయం. అయినా దానము వలన ఎంతో కొంత భూమి సేకరించబడి బీదలకు పంచి పెడితే అంతవరకు సంతోషిస్తాం. బలపరుస్తాం! కాని భూస్వాములవద్దనున్న (అదనపు) భూమి అంతా భూదానోద్యమంద్వారా సేకరించి పంచిపెట్ట గలిగితే ఆనాడు మా అభిప్రాయం తప్పని అంగీకరిస్తాం.

కాని అలా జరుగుతుందని మేము అనుకోవటంలేదు. 1957 ఆఖరుకు భూస్వాముల హృదయ పరివర్తన చేయగలమని వినోబాజీ అన్నారు. ఇక 8 నెలలేకదా గడువు. వేచి చూద్దాం.

ప్రశ్న: గాంధీ గారిది ప్రేమ సిద్ధాంతం, మీది ద్వేష సిద్ధాంతం.

జవాబు: మాకుకూడా ప్రజలపై ప్రేమఉంది. వారు సుఖంగా ఉండాలని అభిలషిస్తాం.

కాని ప్రజలు సుఖంగా ఉండకూడదనే వారిమీద, ప్రజల్ని అణచి, త్రొక్కి పట్టివుంచే కొద్దిమంది మీద ప్రేమ చూపటం సాధ్యంకాదు.

ప్రశ్న: సాధనాలు ముఖ్యమా? లక్ష్యం ముఖ్యమా?

జవాబు: విడిదీసి చూడటం సరికాదు. చెట్టు ముందా? విత్తుముందా? లేక కత్తి బలమా? కలం బలమా? అనే వాదనకు దిగినట్లవుతుంది. లక్ష్యం ఎంతముఖ్యమో, సాధనాలు అంతే ముఖ్యం.

నాకు ఆశయం ప్రధానంకాదు. మార్గాలు ముఖ్యం అని ఎవరైనా అనవచ్చు. కాని ఆ మార్గాలు చేపట్టటం ఏ ఆశయసిద్ధికోసం?

ఏ మార్గమైనా ఆశయాన్ని చేరుకోవటానికి సరి అయిందని నీవు అనుకొంటే చాలదు. అత్యధిక సంఖ్యా ప్రజలుకూడా ఆమార్గం సరి[illegible]సదని అంగీకరించాలి.

ఆ[illegible]ం సాధించటానికి అత్యధిక సంఖ్యాకులను వెనక తీసుకొని వచ్చే మార్గమే ఆలోచించాలి. ఆశయాలు [illegible] లేకపోయినా 'మార్గం [illegible]మార్గం' అని మడికట్టుటకు కూర్చొంటే అదీ మంచిదికాదు.

గాంధీజీ సంఘ సంస్కరణ

# శ్రీ కోదాటి నారాయణరావు

మానవ సంఘంలో ఎంత మంచి ఆచారమైనా కొంత మేరకు పాతబడింతర్వాత దానిలో ఉన్న విశిష్టత తగ్గిపో ప్రారంభిస్తుంది. క్రమేణా ఏ ఆశయంతో ఆ ఆచారం ప్రారంభం అయిందో, ఆ ఆశయం లోపించి కేవలం బాహ్యామైన ఆచారమే మిగిలి పోతుంది. అందువల్ల ఆ ఆచారం నిష్ప్రయోజనం అయిపోతుంది. అంతేగాదు, అది కొంత కాలానికి సంఘం పురోగమించడానికి అభ్యంతరకరంగా పరిణమిస్తుంది. ఇటువంటి ఆచారాలు హెచ్చయి మానవ సమాజం పురోగమించడానికి అభ్యంతకరంగా పరిణమిస్తే అట్టి అభ్యంతరాలను తొలగించవలసిన అవసరమేర్పడుతుంది. ఐతే ఇట్టి నిరోధాన్ని తొలగించుకోవాలని సంఘం ఉమ్మడిగా కూర్చొని తీర్మానించుకోదు. అందులో గల సామాన్య మనుష్యులలో ఏ ఒకరో పూనుకుని అట్టి మార్పును సంఘంలో ప్రవేశ పెట్టలేరు. అట్టి మార్పులను తేవడానికి కొన్ని ప్రత్యేకమైన విశిష్ట లక్షణాలు గల వ్యక్తే పూనుకోగలుగుతాడు. అట్టి లక్షణాలు గలవారే నాయకులనండి, మహాపురుషులనండి, ప్రవక్తలనండి, ఏ పేరుతో

పిలిచినా ఈ సందర్భంలో వారందరినీ కలిపి మనం సంఘ సం స్కర్తలుగా పేర్కొనవచ్చును.

పై యథార్థాన్ని గీత స్పష్టంగా పేర్కొన్నది. ఎప్పుడు మానవ సంఘంలో ధర్మానికి హాని కలుగుతుందో అప్పుడు మహాపురుషు లవతరిస్తారని. ఈ విషయంలో ప్రాచీన భారత ధర్మమనండి, లేదా హిందూధర్మమనండి చాలావిశాల భావాన్ని వ్యక్తపరచింది. ఎంతటి మహావ్యక్తి ప్రబోధాన్నయినా గుడ్డిగా అనుసరించ మనిగాని, తుది ఆజ్ఞగా స్వీకరించమని గాని, అది చెప్పలేదు. ఏ ధర్మాన్నయినా అంతః కరణ అనే గీటురాయిపై గీచి అనుసరించమని చెప్పింది. అయితే ఈ గీటురాయి సాధారణంగా ప్రతిమనిషిలోనూ కని పించేదికాదు. ఎంతో సాధనపైనగాని మనిషిలోని అంతఃకరణ జాగృతమై అతనికి సక్రమమైన ధర్మ దర్శకత్వాన్ని కలిగించదు. ఇట్టి అంతఃకరణనే సాధా రణ భాషలో వ్యక్తిత్వం అని పేర్కొనవచ్చు. అయితే ఖచ్చితంగా చెప్పాలంటే ధర్మ దర్శకత్వం చేయగల అంతః కరణను సాధించడానికి వ్యక్తిత్వం సోపాన పంక్తి వంటిది. సంపూర్ణంగా వ్యక్తిత్వం వికసించిందతర్వాత అంతఃకరణం పరిపూర్ణంగా జాగృతి నొందు తుందన్నమాట. ఇంతకూ వ్యక్తిత్వానికీ ధర్మ దర్శకత్వం చేయగల అంతఃకరణకూ స్థాయీ భేదం అనండి, తారతమ్యం అనండి కొద్దిగా ఉంటుం దనే స్పష్టం చేయడానికే ప్రయత్నించాను. మనుష్యుడి

సాధన ఏ స్థాయి నందుకో గలిగితే, వ్యక్తిత్వం ఆ స్థాయిలో వికాసం చెందుతున్నది.

పై విషయం మనం జాగ్రత్తగా అర్థం చేసుకుంటే సంఘ సంస్కర్తల గల తర తమ భేదాలను సుల భంగా అర్థం చేసుకోవచ్చు. సృష్టి పరిణామంలో మానవు లలో వ్యక్తిత్వ వికాసం ఆరంభమైన నాడే సంఘ సంస్కరణ గూడా ప్రారంభమైందని చెప్పవచ్చు. ఇది ఏదో ఒక యుగంలోగాని, దేశంలో గానిజరిగి ఆగి పొయ్యేదిగాదు. సంఘం జడ స్వరూపం గాక, చైతన్య వంతమైంది. కాబట్టి సంఘ సంస్కరణగూడా నిరంతరం సాగుతుంటుంది. ఎప్పు డెప్పుడు సంఘ పురోగమనానికి అడ్డంకులు కలుగుతుం టాయో, అప్పుడప్పుడు ఏదో ఒక స్థాయిలో సంఘసంస్కరణ ప్రారంభమౌతుంది. అది ఏ వ్యక్తిద్వారానైనా ప్రపంచానికి కనిపించవచ్చు. ఈ విధంగా ఆలోచిస్తే మన మినాడు మత ప్రవక్తలనుకునే వారి నందరినీ సంఘ సంస్కర్తలుగా స్వీక రించవచ్చు. ఆయా దేశాలలో ఆయా కాలాలలో మానవ పురోగమనానికి, పరిస్థితులు, ఆచారాలు అడ్డంగా నిలిచిన సందర్భంలో సంఘంలో కారుచీకటి లాగా వ్యాపించిన మూఢ విశ్వాసాలను ఆమూలంగా తొలగించి, ఒక నూతన కాంతిని దర్శింప జేయటానికి ప్రయత్నించారీ ప్రవక్తలంతా. వారి బోధనలు దేశ కాలాలను అతిక్రమించిన శాశ్వత ధర్మాలుగా పరిగణించి ఆ ప్రవక్తలకు వారి సత్ప్రయత్నా లకు ఒక విధంగా మహా అపచారం చేసిన వారమౌతుంటాం

నాము. ప్రవక్తల సముద్యమా లన్నింటినీ వాటి పరిమితులలో అర్థం చేసుకొని, అందులో ఉన్న మంచిని గ్రహించి దేశ కాలాలకు అనుగుణ్యమైన రూపంలో అనుసరిస్తే నేడు ధర్మం పేరుతో జరుగుతున్న అనర్థాలకు తావులేకపోయేది. అందుకనే ఈ విషయంలో హిందూ ధర్మం కొంత విశాల భావాన్ని ప్రదర్శించిందని చెప్పగలిగాను. విశిష్టమైన ఏ ధర్మాన్నీ అది వదలి వేయక తనలో లీనం చేసుకున్నది. అయితే తుప్పుపట్టి పోయిన అనేక ఆచారాలను అనుసరించటం హిందూ ధర్మంలో పరిపాటిగా కాన వస్తుంది. అయినప్పటికీ ఇట్టి ఆచారాలను సంస్కరించే ప్రయత్నం గూడ నిరంతర ఉద్యమంలా ముందుకు సాగటం మనం చూస్తున్నాము. బహుశా ఈ సచ్చీలమే హిందూ ధర్మాన్ని సజీవంగా ఉంచ గలిగించే మొ! మొత్తంమీద ఒక మాట చెప్పవచ్చు. ప్రపంచంలో జన్మించిన ప్రతి సంఘ సంస్కర్త, ప్రవక్త కాక పోవచ్చునుగాని, ప్రతిప్రవక్త మాత్రం విధిగా సంఘ సంస్కర్త. ఈ సంఘసంస్కరణ అనాదిగా సంఘంతో పాటు మనిషికి నీడవలె ముందుకు సాగుతూనే ఉంటుంది. అట్టి సంస్కరణోద్యమం లేని స్థితి ఆచరణలో సంభవించదు. అది కేవలం ఊహాస్వర్గం మాత్రమే.

సంఘ సంస్కర్తల్లో మానవ జీవితాన్ని సమగ్ర స్వరూపంలో అర్థంచేసుకొని సంస్కరించడానికి పూనుకున్న వారు చాలా అరుదని చెప్పవచ్చు. శోచనీయమైన తాత్కాలిక పరిస్థితినిచూచి, వేదనపడి దానికి ప్రతి క్రియగా మరొక మార్గాన్ని తొక్కిన ప్రవక్తల ఉదాహరణలే అనేకంగా

చరిత్రలో మనకు కనిపిస్తాయి. భారత ప్రముఖ వేదాంత మార్గ ప్రవక్తలైన శంకర, రామానుజ, మాధ్వాచార్యులను తీసు కొండి. వారు అప్పటికి గల ఆధ్యాత్మిక సిద్ధాంతాలలోని చెడుగులను, అనుష్ఠిస్తున్న కొన్ని ఆచారాలలో ప్రవేశించిన చెడుగులను చూచి, బాధపడి మరో మార్గాన్ని చూచారే కాని మానవ జీవితంతో ముడిపడ్డ అన్ని సమస్యలను పరిశీ లించడానికి పూనుకోలేదని చెప్పవచ్చు. గౌతమ బుద్ధాదులు కొన్ని మూలసిద్ధాంతాలను ప్రతిపాదించి, ఆ మార్గాలను అనుగమిస్తే అన్ని సమస్యలూ పరిష్కారం కాగలవని భావిం చారు. మహమ్మదు ప్రవక్త అరేబియా దేశంలో ఆనాడు గల మూఢ నమ్మకాలను చూచి ఏవగించుకొని తిరుగుబాటు చేశాడు. ఈ విధంగా ఆయా దేశాల్లో కాలాలలో గల పరిసర ప్రజానీకం దుస్థితిని జూచి ప్రభావితులై ప్రతిక్రియగా నూతన మార్గాలను అన్వేషించి చూపించిన వారే చాలా మంది దొరుకుతారు. అంతే కాని మానవుని జీవితాన్ని దాంతో ముడి పడిన అన్ని సమస్యలను, సమగ్రంగా ఆక ళింపు జేసుకొని, సంస్కరించాలని పూనుకున్న వారు చరిత్రలో మన కంతగా కనిపించరు. నే నీమాట చెప్పేది పూర్వయుగపు సంస్కర్తలను గురించేకాదు. ఆధునిక సంఘ సంస్కర్తల విషయంలోనూ ఈ సూత్రమే అన్వయిస్తుంది. భారత దేశంలో ఈనాడు మనం సంఘ సంస్కర్తలని పేర్కొనే వారిని ఒకసారి పరిశీలిద్దాం. రాజా రామమోహన్ రాయలు, ఆనాడు గల విద్యా విధానంలోని సంకుచిత తను, సహగమన ఆచారంలోని అమానుషత్వాన్ని చూచి,

వ్యథపడి వాటి సంస్కరణకు పూనుకున్నాడు. ఈశ్వర చంద్ర విద్యాసాగరులు, హిందూ సంఘంలో బాల వితంతువులు అనుభవించే హృదయ విదారకమైన బాధలకు పరితపించి, వితంతు వివాహ ఆచారాన్ని ప్రవేశపెట్టాడు. ఇతర మతాలు విమర్శించే పరంపరాగతమైన దురాచారాలను సంస్కరించి ప్రాచీన సిద్ధాంతాలపై హిందూ సంఘాన్ని పునః ప్రతిష్ఠించి ఇతర మతాలకు గురి కాకుండా హిందూ సంఘాన్ని వైదిక మార్గాన్ని బట్టించ చూచారు దయానంద సరస్వతి. సూక్ష్మంగా పరిశీలిస్తే వీరిలో ఎవరూ మానవ జీవితాన్ని సమగ్రంగా అర్థం చేసుకుని దాంతో ముడి పడ్డ అన్ని సమస్యలను గురించీ ఆలోచించి ఆ మూలాగ్రమైన సంఘ సంస్కరణకు పూనుకున్నట్టు కనిపించదు.

ఈ విషయంలో గాంధీజీ చేసిన కృషి విశిష్టమైనదని చెప్పుకోనవచ్చు. ఆయన మానవ జీవితాన్నంతటనీ ఒక యూనిట్‌గా భావించి అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాడు. జీవితంతో సంబంధం గల ఒక సమస్యకూ మరొక సమస్యకూ మధ్య ఏమైనా గోడవంటి దేదీ లేదని అన్ని సమస్యలూ ఒక దానితో నొకటికి అవినాభావ సంబంధం కలవని ఆయన భావించారు. అందుకనే ఆయన కృషి ఏదో ఒక ప్రత్యేక అంశం వరకు మాత్రమే పరిమితమై ఉండలేదు. ఈ విషయం ఆయన కృషిని జాగ్రత్తగా పరిశీలిస్తే మన కర్థమౌతుంది. [illegible] ఆధారంగా చేసుకుని కొందరు మానవులు కేవల దురహంకారంతో తమతోటి

సోదరులను నీచులుగా పరిగణించే మనః ప్రవృత్తికి విరుద్ధంగా దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం సాగించాడు. మిల్లు యజమానుల విపరీత లాభాపేక్షకు ప్రతికూలంగా అహమదాబాదులో కార్మికోద్యమానికి నాయకత్వం వహించారు. కాకతాళీయంగా శాసనరీత్యా లభించిన యాజమాన్యాధికారంతో చెమటోడ్చి కష్టించే శ్రామికుల పొట్టగొట్ట లాభాలు గడించే నీలితోట యజమానులకు ప్రతికూలంగా చాంపరాన్ సత్యాగ్రహాన్ని నడిపారు. భారత దేశపు ప్రజానీకపు అభీష్టానికి వ్యతిరేకంగా వారిని పరిపాలించే అధికారం లేదని బ్రిటిషు వారిని భారత దేశంనుండి వెళ్ళిపోవలసిందిగా అను శాసించారు. ధనమూ, అధికారము, కేంద్రీకృతం కావడం మూలంగావచ్చే చెడుగులను అర్థంచేసుకొని వికేంద్రీకృతమైన సమాజ రచనకు పూనుకొన్నారు. మానవ జీవితంలో ఏ అంశాన్నీ ఆయన అవకాశం ఉన్నంత వరకు స్పృశించక వదల్లేదు. ఆరోగ్యమూ, విద్య, వైద్యము మొదలుకొని, ఆధ్యాత్మిక మార్గం వరకు దేన్నీ ఆయన పరిశీలించకుండా విడిచి వేయలేదు.

దీని కంతటికీ కారణం ఒక సమస్యకూ, మరొక సమస్యకూ మధ్య అవినాభావ సంబంధం ఉండి, తీగను కదిలిస్తే డొంకంతా కదలడమే కారణం. ఈ విధంగా మానవ జీవితాన్ని సమగ్ర స్వరూపంలో అర్థంచేసుకొని, సమస్యలను పరిశీలించ పూనుకున్న వారిలో ప్రముఖ సంస్కర్తలు

ఇద్దరు. ఒకడు కారల్ మార్క్స్, రెండవవాడు గాంధీజీ. అయితే ఉభయులూ, సంఘాన్ని అర్థం చేసుకున్న విధాలు వేరు. అయినప్పటికీ మానవ జీవితాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవడానికి పూనుకోవడం మాత్రం ఉభయులకు సమాన ధర్మం.

కారల్ మార్క్స్ మానవ జీవితం యావత్తునూ ఉత్పత్తి సాధనాల యాజమాన్య వ్యవస్థపై ఆధారపడి ఉన్న దానిగా అర్థంచేసుకొని గతి తార్కిక భౌతిక సిద్ధాంతాన్ని దాని కనుగుణ్యమైన సంస్కరణ మార్గాలను ప్రతిపాదించాడు. దీన్నే కమ్యూనిజం అనే పేరుతో ఆయన వ్యవహరించాడు. ఆయన యావత్తు కృషీ ఉత్పత్తి సాధనాయ యాజమాన్యాన్ని శ్రామికుల హస్తగతం చేయవలె ననే సిద్ధాంతం పైననే కేంద్రీకరించాడు. ఇందుకు భిన్నంగా గాంధీజీ వ్యక్తిత్వ వికాసం పైననే సంఘం పురోగమిస్తుందని నిశ్చయించాడు. దాని కనుగుణ్యంగా ఆయన తన కృషినంతా వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడగల మార్గాలను అన్వేషించడంలోను ప్రయోగించడంలోను, కేంద్రీకరించాడు. ఇందులో ఎవరి పద్ధతి సరియైందని, ఎవరిది కాదని నిరూపించడం కాదు నాపని. ఉభయుల్లో ఉన్న విభిన్నతను దిఙ్మాత్రంగా సూచించడమే నా అభిప్రాయం.

గాంధీజీ సంస్కరణోద్యమం ద్విముఖమైందని చెప్ప వచ్చు. ఒకటి సద్యోఫలితం సాధించటం కొరకు చేసిన కృషి.

మరొకటి భవిష్యత్‌కు సంబంధించిన దూరదృష్టితో సాగించిన కృషి. ద్విముఖమైన కృషి అన్నంత మాత్రాన ఒకదాని కొకటి సంబంధం లేని రెండు విధాలయిన కృషులుగా అపార్థం చేసుకోరాదని శ్రోతలకు విన్నవిస్తున్నాను. ఈ రెండు విధాలయిన కృషులూ అన్యోన్యాశ్రయాలు. సద్యః ఫలితానికి చేసిన కృషి భవిష్యత్ కృషికి నాందిగా మాత్రమే ఉపకరించాలని ఆయన ఉద్దేశించారు. ఉదాహరణకు భారతదేశ స్వాతంత్ర్యం సద్యః ఫలితానికి ఆయన చేసిన ఘనతమ కృషిగా మనం తలుస్తే ఆయన దాన్ని గురించి అనేకసార్లు ఎంతో స్పష్టంగా చెప్పారు. భారత స్వాతంత్ర్యం కేవలం ఉపకరణ మాత్రమే నని. స్వాతంత్రసిద్ధి తర్వాతనే నిజమైన పునర్నిర్మాణ కృషి ప్రారంభం కాగలుగుతుంది కనుక, అందుకొరకై మన యావత్కృషినీ కేంద్రీకరించాలని ఆయన భారత ప్రజలకు ఉపదేశించాడు. అందుకనే భవిష్యనిర్మాణం విషయంలో విభిన్న దృక్పథాలుగల అనేక సిద్ధాంతానుయాయులు స్వాతంత్ర్య సంగ్రామంలో గాంధీజీ ననుసరించారు. అట్లే అస్పృశ్యతా నివారణ సమస్య. ఈవిషయంలోనూ సద్యః ఫలితానికి గాంధీజీ చేసిన కృషి భవిష్యనిర్మాణానికి ఒక మెట్టు. గాంధీజీ భవిష్యత్ సంఘ నిర్మాణానికి చేసిన కృషిని మనం శుభ కార్యాలకు ముందుచేసే గణపతి పూజతో పోల్చవచ్చు. లేదా విత్తులను నాటటానికి ముందు భూమిని దున్ని సిద్ధపరచేదిగా పేర్కొనవచ్చును. ఇట్టి కృషిలో పేర్కొన దగిన విషయాలు వార్ధా విద్యా విధానం, కుటీర పరిశ్రమలు మొద

లైనవి. ఆయన తన అభిప్రాయాల కనుగుణ్యంగా సమాజ నిర్మాణం కావాలంటే దేశంలో అట్టి వాతావరణం కలగటానికి ఇటువంటి కృషి అవసరమని అనుకున్నాడు. అయితే ఇవి ఒకటి రెండు రంగాల్లో కాదు, అన్ని రంగాల్లోనూ ఆయన వివిధ ప్రయోగాలను చేసి, కొన్నింటిలో ఫలితాలను సాధించాడు. పార్టీని మొదలుకొని ప్రజాస్వామ్యం వరకు ప్రతి రంగంలోనూ ఆయనచేసిన కృషిని ఒకే ఒక గీటు రాయిపై గీచి చూడాడని చెప్పవచ్చు. దాన్ని ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన కృషి అంతా వ్యక్తిత్వ వికాసానికి ఎంతవరకు తోడ్పడ గలుగుతుంది అన్న దాని మీదనే ఆధారపడివున్నది. వ్యక్తిత్వ వికాసం పైన సంఘ నిర్మాణ సమస్య ఆధారపడి ఉన్నదని, అదే సంఘాన్ని సవ్యంగా పురోగమింప జేస్తుందని ఆయనవిశ్వాసం. ఆయన స్వావలంబన పద్ధతి వ్యక్తి సంపూర్ణ స్వాతంత్ర్య ప్రతిపత్తికి పునాది. ఇతరులపై ఆధారపడ్డ వ్యక్తి సంపూర్ణ స్వతంత్రుడు ఎన్నడూ కాజాలడు. సంపూర్ణ స్వతంత్రుడు కాని వ్యక్తిలోని వ్యక్తిత్వం సంపూర్ణంగా వికసించ జాలక పోయింది అని అర్థం. ఈ విషయంలో ఆయన ఎంత ముందుకు వెళ్లాడంటే, ఏవ్యక్తి అంతరంగానికైనా ఏదైనా శాసనం సంఘ పురోగమనానికి అభ్యంతర మనిపిస్తే అతనికి ఆ శాసనాన్ని ధిక్కరించే సహజాధికారం ఉంటుందన్నాడు. దీన్ని బట్టి ఆయన వ్యక్తి స్వాతంత్ర్యానికి ఇచ్చిన ప్రాముఖ్యత బోధపడుతుంది. అయితే వ్యక్తి అని మనం అన్నప్పుడల్లా సాధారణమైన మనిషి అని

అర్థం చేసుకోరాదు. ఎవరిలో వ్యక్తిత్వం వికాసం జెందు తుందో అట్టి మనుష్యుడే ఆ స్థాయిలో వ్యక్తి కాగలుగు తాడు. కాని సామాన్య మానవులందరికీ ఆయన ఉపదేశాలు అన్వయించవు. అందుకనే గాంధీజీ ఉపదేశాలను సూక్ష్మంగా ఆలోచించి అర్థం చేసుకొని ఆచరించవలసి ఉంటుంది. ప్రతి మనిషీ తనకు నచ్చని శాసనాన్ని ఉల్లంఘిస్తే సంఘ జీవనమే దుర్భరమై పోతుంది. గాంధీజీ సాగించిన సత్యాగ్రహోద్య మాలలోనూ, ఆయన ప్రజా బాహుళ్యంతో గూడిన మూక ఉద్యమానికంటే వ్యక్తి సత్యాగ్రహానికే ఎక్కువ ప్రాము ఖ్యత యిచ్చాడని చెప్పవచ్చు. అంటే సంఘ బలాని కంటే వ్యక్తిత్వ ప్రభావానికి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చాడన్నమాట. ఇదంతా చెప్పవచ్చింది గాంధీజీ తన కృషిలో వ్యక్తిత్వానికిచ్చిన ప్రాధాన్యతను వివరించి చెప్ప డానికే. సత్యాగ్రహం వ్యక్తిత్వ స్థాయినిబట్టి ఫలితం ఉంటుం దని ఆయన ఎన్నోసార్లు స్పష్టంగా చెప్పాడు.

ఆయన చేసిన ద్విముఖమైన కృషిలో ఒకటి సద్యో ఫలితాన్ని సాధించడానికని ఇదివరకే చెప్పాను. అట్టి దానిని ఆయన అంతో ఇంతో వ్యక్తిత్వం ఉన్నవారికే బాధ్యతగా అప్పగించాడు. జన బాహుళ్యం వారికి వత్తాశిగా తోడ్పడ వలసిందిగా మాత్రమే ఆయన కోరాడు. ఇది ఆయన చేసి చూపించిన ఒక కార్యవిధానం. ఇందువల్ల సంఘం త్వరిత గతిని పురోగమించకున్నా, పెడ మార్గాల పట్టదని ఆయన విశ్వాసం. ఒక వేళ పట్టినా త్వరలోనే తెలుసుకుని సరియైన

దారిని పట్టించవచ్చునని ఆయన అభిప్రాయం. రెండో ముఖ్యమైనకృషి ప్రజాబాహుళ్యంలో సాధ్యమైనంత హెచ్చుపరిమాణంలో వ్యక్తిత్వాన్ని సిద్ధింప జేయాలనే. దానికై ఆయన అనేక ఉద్యమాలు అనేక రంగాల్లో ప్రవేశపెట్టాడు. అనేక ప్రయోగాలు చేశాడు. అయితే వీటన్నింటికి కీలకం ఈ కృషి నంతటినీ సమన్వయ దృష్టితో చూడటం. అంతే గాని ఏ అంశానికా అంశాన్ని తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదంగా పరిగణించరాదు. ఈవిధంగా గాంధీజీ తలపెట్టిన కృషికి అనేక సంస్థలు తర్వాత వెలసినవి. చివరకు ఆయన ఆరోగ్యాన్నీ, పారిశుద్ధ్యాన్నీ, సంఘంలో ఏ విషయాన్నీ స్పృశించక వదల్లేదు. వ్యక్తిత్వ వికాసానికి ఆయన తలపెట్టిన కార్యక్రమాలకే నిర్మాణ కార్యక్రమ మనే వ్యవహార నామం వచ్చింది. అయితే నిర్మాణ కార్యక్రమంలో సమ్యక్ దృక్పథం లేకపోతే ఆ కృషి గాంధీజీ తలపెట్టిన ఫలితాన్నివ్వదు. మెకానికల్‌గా పరిణమించి, ఏదో కొద్దిపాటి ఫలితాన్ని కలిగించవచ్చు. ఉదాహరణానికి బేసిక్ విద్యను అర్థం చేసుకొని, విశ్వాసంతో కృషిచేయడానికి బదులుగా విధిలేక ట్రైనింగు పొందిన బడి పంతులు నేర్పే చదువువల్ల గాంధీజీ తలపెట్టిన ఆశయం నెరవేరడం భ్రమ. అట్లే కేవలం తాత్కాలికమైన ఉపాధి నిమిత్తం కుటీర పరిశ్రమలను ప్రవేశపెడితే తాత్కాలికమైన ఉపాధి చేకూరవచ్చుగాని గాంధీజీ తలపెట్టిన సంపూర్ణ స్వాధీనత వ్యక్తికి ఏర్పడటానికి దారితీయదు. ఈవిధంగా ఎన్నయినా మనం ఉదాహరణలను పేర్కొనవచ్చును.

గాంధీజీ భావుకుడు కాదు. అనుష్ఠాత. ఒక్కొక్క

అభిప్రాయం తనకు తట్టినప్పుడు గానీ, లేదా ఎవరైనా తన ముందు పెట్టినప్పుడు గానీ ఆచరణలో అది ఎటువంటి ఫలితాన్నిస్తుందో ప్రయోగించి, పరిశీలించి అప్పుడు గాని దాన్ని గురించి ఇతరులకు చెప్పే వాడుకాదు. అందువల్ల ఆయన ప్రతిపాదించిన ఏ విషయం గాని, పిడి వాదంగా తయారుకాలేదు. నిరంతర పరిణామ శీల మైన సృష్టిలో ఎప్పుడు సరిగాదని రుజువైతే అప్పుడు తాను చెప్పినమాట మార్చుకోడానికి గాంధీజీ వెనుదీయలేదు. అసలు 'గాంధేయం' అని చెప్పదగిన తత్వంగాని సిద్ధాంతం గాని ఏదీ లేదని అనేకసార్లు గాంధీజీ ఎలుగెత్తి చాటాడు. అందువల్ల గాంధీజీ ప్రతిపాదించిన సంఘ సంస్కరణలు ప్రపంచ రంగం మీద నిరంతర పరిశీలనకు గురి కావడానికి సిద్ధంగా ఉన్నవి. అంతే కాని పిడి వాదంగా తయారై కూర్చోలేదు. వాస్తవంగాచూస్తే గాంధీజీ ఏ క్రొత్త సిద్ధాంతాన్నీ ప్రతిపాదించలేదు. ఆచరణ అనే గీటురాయిపై గీసి పరీక్షకు నెగ్గిన పాత విషయాలనే దేశ కాలాలకు అనుగుణ్యంగా తిరిగి ప్రవేశ పెట్టాడు. ఎక్కడ మంచి ఉన్నా ఆయన వదలి వేయలేదు. ఎంత ప్రియమైన వస్తువుగా కనిపించినా చెడుగును స్వీకరించనూలేదు. ఈ సమన్వయ శీలం గాంధీజీ సంఘ సంస్కరణలోగల విశిష్టతలలో ముఖ్యమైంది. అత్యంత ప్రధానమైందిగూడాను. నిజానికి ఈ ఉపన్యాసంలో నేను పేర్కొన్న విశిష్ట లక్షణాలన్నీ నిరంతర సాధననే సాధించి గాంధీజీ తన వ్యక్తిత్వంలో లీనం చేసుకున్నాడు. తద్వారా అంతకంటే ఉన్నత స్థితిని సాధించి ధర్మ దర్శకమైన

అంతఃకరణను సాధించ గలిగాడు. ఆయన తలపెట్టిన ప్రతి సంస్కరణలోనూ ఆయన వ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. సూక్ష్మంగా పరిశీలిస్తే ఆయనకు సర్వతోముఖమైన జ్యోతి మన కున్నూ మిణుకు మిణుకు మంటూనైనా దారి చూపిస్తోంది.

ఈనాడు గాంధీజీ సంఘ సంస్కరణకు ప్రతిపాదించిన నిర్మాణ కార్యక్రమాన్ని రెండు విధాలుగా అపార్థం చేసుకోవడం సాధారణంగా చూస్తున్నాం. అందులో ఒకటి గాంధీజీ చెప్పిన వాక్యాలూ, సిద్ధాంతాలూ, ప్రవక్తల తుది ఆజ్ఞలవలె శిరసావహించి వాటిపై ఎట్టి పరిశీలనా చేయరాదనే అంధప్రాయమైన విశ్వాసం. గాంధీజీ వంటి మహావ్యక్తి కాబట్టి ఆయన చెప్పిన సిద్ధాంతాలు ఆచరించ గలిగాడు కాని సాధారణమైన మానవునికి అవి ఆచరణ సాధ్యం కావనేది రెండవది. ఈ రెండు విధాలైన ఊహాలు గాంధీజీని ఆరాధ్య దైవంగా చేసి, ఆయన ప్రబోధాలకు తీరని అపకారం చేసేవే అవుతున్నాయి. ఇక ఆయన ఉద్దేశ్యాల పట్ల శ్రద్ధా భక్తులు ఏమాత్రం లేక ఆయన పేరున చిలుక పలుకులవలె నిరంతరం ఉచ్చరించే వారి సంగతి చెప్పనే అక్కర లేదు. ప్రభుత్వ స్థాయిలో ప్రవేశ పెట్టే ఆయన కార్యక్రమాలు మెకానికల్ గా ఉండి ఆయన మహదాశయంతో పోల్చిచూస్తే అంత్యంతాల్పమైన ఫలితాన్నిచ్చేవిగా ఉన్నవి.

మార్క్సుకు లెనిన్ లభించినట్లు గాంధీజీకి ఆయన మహదాశయాన్ని ముందుకు తీసుకు పోగలిగిన మరొక మహా వ్యక్తి లభిస్తే ప్రపంచంలో గాంధీజీ తత్వానికి గల మహత్తు విజయ దుందుభిని మ్రోగిస్తుందనటంలో సందేహం లేదు. *

## గాంధీజీ ఆర్థిక దృక్పథం

### శ్రీ బలవంత రెడ్డి

విద్యార్థిగా పాశ్చాత్య అర్థ శాస్త్రవేత్తల రచనలను చదివేప్పుడు, మన దేశంలో ఎప్పుడైనా ఇలాంటి శాస్త్రబద్ధమైన ఆర్థిక ఆలోచనా విధానం ఉండేదా, ఇక ముందు ఉంటుందా అనిపించేది. ఆ రోజుల్లోనే, ఆనాటి పరిస్థితుల కనుగుణంగా ఆలోచనచేసి వ్రాయబడిన గ్రంథం ఒకటి చూడటం తటస్థించింది. ఇందువల్ల 19 వ శతాబ్దపు చివరి భాగంలోను, 20 వ శతాబ్దపు ప్రారంభంలోను భారతీయ మేధాసంపన్నులు ఆర్థిక సమస్యలపై చేసిన రచనలను సరిగా అర్థం చేసుకోవడం నాకు సాధ్యపడింది. దాదాభాయి నౌరోజీ, రనడే, గోఖలే గార్ల ఆర్థిక రచనలను సూత్రీకరిస్తూ రెండు సంవత్సరాల క్రితం ఒక పుస్తకం వెలువడింది. దీనితో ఈ విషయమై నాకుగల విశ్వాసం దృఢపడింది.

నేటి ఆర్థిక శాస్త్రవేత్తల భావాలనుబట్టి చూస్తే ఆర్థిక సమస్యలపై గాంధీజీ కొనసాగించిన రచనలు, ఒక నిర్దుష్టమైన ఆర్థిక సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నాయని తలచలేము. నిజానికి ఆయన రచనలన్నీ సమగ్రమైన సర్వతోముఖమైన ఒక

సాంఘిక దృక్పథానికి భాగాలు. ఈదృక్పథం ఒక ప్రత్యేక జీవిత విధానానికి పునాది. ఆర్థిక సమస్యలపై ఆయన అభిప్రాయా లను పరిశీలించేటప్పుడు పై విషయాన్ని దృష్టిలో పెట్టుకో వాలి. అంతేకాక విదేశ పాలనకు వ్యతిరేకంగా తాను కొన సాగిస్తున్న ప్రజా ఉద్యమ సందర్భంలోనే, వివిధ సమస్యలపై తన భావాలను ఆయన వ్యక్తంచేస్తూ వచ్చారు. ఈ జాతీ యోద్యమ సంగ్రామ వ్యూహంలో, గాంధీజీ ఆర్థిక ప్రతి పాదనలు కూడా ఒక భాగమేమో నని పరిశీలించినప్పుడే, ఆయన రచనల విలువ సంపూర్ణంగా సుబోధకం అవుతుంది.

గాంధీజీ అనుచరుల్లో ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా, గాంధీజీ ఆశయాలకు భాష్యంచెప్పారు. ఇదేమంత ఆశ్చర్యకరమైన విషయంకాదు. ప్రతి మతంలోను ఇలాంటి చీలికలు కలిగాయి. మార్క్స్ చెప్పిన భూతల స్వర్గాన్వేష ణకు, ఆయన అనుచరులు కూడా విభిన్న మార్గాలు అవలం బించారు. ఒక విధంగా ఇది ఆరోగ్య ప్రదమైన పరిణామమే. అయితే గాంధీజీ ఆలోచనా పద్ధతిని గ్రహించేటప్పుడు, బాహ్య రూపాలను కాక అంతర్గతమైన ప్రాతిపదికనే గమ నించాలి.

ఏ దేశంలోనైనా శత్రువు అందరినీ సమిష్టిగా ఎదు ర్కొంటున్నప్పుడు, ఆంతరంగిక విభేదాలను, శత్రు నిర్మూలన జరిగేవరకు విస్మరించ వలసి ఉంటుంది. గాంధీజీ వర్గ సంఘర్ష ణను వ్యతిరేకించడానికి ఇదే ప్రధాన కారణ మనిపిస్తుంది.

స్వాతంత్ర్య సమరం విజయవంతం కావడానికి రైతు, కార్మి
కుడు, మధ్యతరగతి ప్రజ, పెట్టుబడిదార్లు అందరి సహకారం
గాంధీజీకి అవసరమైంది. వర్గ సంఘర్షణకు వ్యతిరేక, ధర్మ
కర్తృత్వ సిద్ధాంతంద్వారా, ప్రజల్లో అన్ని తరగతుల వారిని
ఒక సమిష్టి ఆశయ సాధనకై, ఒకే నాయకత్వం క్రింద
ఆయన సమీకరించ గలిగారు. ఇదే విధంగా, స్వదేశీ ఉద్య
మం, సహాయ నిరాకరణ, శాసనోల్లంఘనం, హర్తాళ్ళు, పెద్ద
యంత్రాల పట్ల వ్యతిరేకత, ఇవన్నీ జాతీయోద్యమ ఆయు
ధాలుగా ఉపకరించాయి. ఆరోజుల్లో ఈ భావాలు, విధా
నాలు కలిగించిన ప్రభావాన్నీ, సాధించిన విజయాన్నీ కాదన
లేము. కాని ఇక్కడొక ప్రశ్న ఉదయిస్తోంది. స్వాతంత్ర్య
సముపార్జ నానంతరం మన సమాజాన్ని ఎదుర్కొంటున్న
పరిస్థితులు, సమస్యలు అన్నీ సంపూర్ణంగా మార్పు చెంది
నప్పుడుకూడా, మన ప్రధాన సాంఘిక తత్వం, ఆనాటి
రూపంలోనే ఉండాలా?

గాంధీజీ సాంఘిక దృక్పథానికి కొన్ని మూలములైన
ప్రతిపాదనలు ఉన్నాయి. ఈ ప్రతిపాదనలు సక్రమమైనవని
ముందు మనం ఒప్పుకుంటే మిగతా వివరాలను తరువాత
పరిశీలించవచ్చు. మానవుని అవసరాలు అత్యల్పంగా ఉం
డాలి. వాటిని హెచ్చించుకో కూడదు. ఈ ప్రతిపాదనకు
సమ్మతిస్తే, ఇక ధర్మకర్తృత్వం, భారీ యంత్రాలపట్ల శోషణపట్ల
వ్యతిరేకత, స్వదేశీ వగైరా తరువాత వస్తాయి. కాని ఇలాంటి
జీవనం ప్రపంచంలో అందరూ అవలంబించ వలసి ఉంటుందన్న

విషయాన్ని ఈ సందర్భంలో నేను చెప్ప దలచు కొన్నాను. లేకపోతే కొన్ని దేశాలు తమ పరిధులను విస్తృతం చేసు కోవచ్చు. అందువల్ల ఇతర జనుల మనుగడ ప్రమాదంలో పడి, పై విధమైన జీవనాన్నే వారు విడనాడవలసి వస్తుంది. అదీ కాక, సమాజం ఇలా మార్పు చెందాలంటే మానవుల ప్రవర్తన, నడవడి కూడా ఒక రకంగా మారవలసి ఉంటుంది. హృదయ పరివర్తన ద్వారా ప్రజల సమ్మతిని బడసి ప్రజల జీవనాన్ని మార్చాలి. మరి ఇలా పరిణామం సాధించవచ్చు ననడానికి తగిన ఉదాహరణలు మనకు కనపడ టంలేదు. మానవ నడవడి, ప్రవృత్తులను ఇంకా గాఢంగా పరిశీలిస్తే కానీ ఏమీ చెప్పలేము. పారిశ్రామిక విప్లవ ప్రసవ వేదనలు ఐరోపా దేశాలు అనుభవిస్తున్న రోజుల్లో, మోర్, ఓవెన్, ఫొరియర్, లాంటి వారి— వీరినే మార్క్సు ఉటోపి యన్ సోషలిస్టులు అన్నాడు— ఆలోచనా పద్ధతికీ, గాంధీజీ ఆలోచనా విధానానికీ గల సాదృశ్యాన్ని కూడా మన మిక్కడ గమనించాలి. అయితే ఈ అభిప్రాయాలపై నేనిప్పుడే ఇది సిద్ధమని ఏమీ చెప్పడంలేదు. కాని ఈభావాలు ప్రస్తుత సమాజానికి ఎంత మహత్తరమైనవో వివరించేటప్పుడు వాటిని స్థూలంగా కాక, వాటి అంతర్గత మూలాన్ని పరిశీ లిస్తే వాటి విలువ ఇంకా హెచ్చుతుందని నా అభిప్రాయం.

ముందు ధర్మకర్తృత్వం గురించి పరిశీలిద్దాం. ట్వానీ అన్నట్టు ఆర్జనపై ఆధారపడే సమాజ వ్యవస్థ పట్ల అసమ్మతి తెలుపడానికే ధర్మకర్తృత్వ సిద్ధాంతం ఉద్దేశించబడింది. ఈ

సమాజంలో కొంద రు వ్య క్తు లు తమ ఆర్జనలకై ఎందరో శ్రామికులను దో పి డీ చే స్తా రు. సంపద, భూములు, యంత్రాల లాంటి ఉత్పత్తి సాధనా లైన ఆస్తుల యజమానులు, వాటిని సమాజ పక్షాన ధర్మ కర్తలుగా నిర్వహిస్తే, స్వార్థ అన్న భావానికి తావుండదు. అందుకని ఒకరిని దోపిడీ చేయవలసిన అవసరమూ వుండదు. ప్రస్తుతం యజమానులుగా ఉన్నవారి దృక్పథంలో మార్పు స్వయంగా వస్తేనే ఇది సాధ్యపడుతుందని వేరే చెప్ప నక్కరలేదు. కాని ఇలాంటి మార్పు రావడం సందేహాస్పదం. కాని సంఘపరంగావత్తిడి తెచ్చికూడా ఈమార్పును తేవచ్చును. ఈ రెండవ మార్గాన్ని అవలంబిస్తే దానికి, వ్యక్తుల ఆస్తులను సంపదను ప్రభుత్వం శాసనం ద్వారా స్వాధీన పరచుకో డానికీ నాకు తేడా కనపడదు. ప్రభుత్వం సమాజానికి ప్రాతి నిధ్యం వహిస్తుంది. సాధారణంగా ప్రజల వాంఛల నాధారం చేసుకునే ప్రభుత్వ విధానం కూడా ఉంటుంది.

నిత్యం పరిణామం చెందుతూ ఉండే సాంకేతిక శాస్త్రా నుగుణంగా మారుతూ ఉండే యంత్రాలకు గాంధీజీ వ్యతి రేకి అని చాలామంది నమ్ముతున్నారు. సాంకేతికాభివృద్ధ మంచిదైనా కాక పోయి నా సాం కే తి క శా స్త్ర చరిత్రలో అభివృద్ధి నిరోధకమైనది నాకేమీ కనపడడం లేదు. భారీ పరిశ్రమల్లో, యజమానుల కోసమని, పెట్టుబడి దారీ వ్యవస్థలో- కార్మికులు శ్రమించ వలసి ఉంటుంది. నిజమే. యంత్రాల యాజమాన్యం ప్రభుత్వ పరమైనప్పుడు కూడా

కార్మికుల శ్రమ మరొక రూపంలోనైనా కావలసి ఉంటుంది. కాబట్టి కార్మికుడికి స్వేచ్ఛ అనుభవించడానికీ, చొరవ తీసు కొనడానికి, ఎంత వరకు అవకాశం లభిస్తుందన్నదే ఇక్కడ ముఖ్యమైన ప్రశ్న. భారీ ఎత్తున గల అన్ని విస్తృత వ్యవస్థ ల్లోనూ ఈ సమస్య ఉన్నది. పాశ్చాత్య మేధావులు కూడా దీన్ని గూర్చి ఆలోచన చేస్తున్నారు. కాని వీటికి ప్రత్యామ్నా యంగా వికేంద్రీకృతమైన చిన్న తరహా లేక కుటీర పరిశ్రమ లను స్థాపిస్తే ఈ సమస్యకు పరిష్కారం లభిస్తుందనలేము. పరపతి, క్రయ విక్రయాలకు ఇవికూడా ఏవో కొన్ని వికేం ద్రీకృత సంస్థలపై ఆధారపడవలసి ఉంటుంది. ఇలా ఆధార పడిన మేరకు వీటికి స్వేచ్ఛ, ఉత్పాదనలో చొరవ, ఈ చిన్న పరిశ్రమలకు లేకుండా పోతాయి. కాగా, సాంకేతిక ప్రగ తిని అంగీకరిస్తూ, కార్మికుల సహకార సంఘాలు, మొదలైన వాటి ద్వారా, ఈ సాంకేతిక ప్రగతివల్ల ఏర్పడే సమస్యలకు పరిష్కారాలను అన్వేషించాలి.

భూమి వితరణ, గృహ పరిశ్రమలతో నిరుద్యోగ సమస్య పరిష్కారమవుతుందని కూడా చెబుతున్నారు. ఈ భూమి వితరణవల్ల ప్రస్తుత వ్యవసాయ కార్మికులందరికీ భూమి లభి స్తుందని ఒక వేళ మనం సమ్మతించినప్పటికీ, జనాభా పెరుగు దల ఫలితంగా ఈ వితరణ ఎడ తెరపి లేకుండా కొనసాగు తూనే ఉండాలి. కాని ఆర్థిక ప్రగతి వాంఛనీయం అని మనం నమ్మితే, ఈ కార్యక్రమం అభివృద్ధికి ఆటంకం కలిగిస్తుంది. కుటీర పరిశ్రమలు, చిన్న చిన్న నీటి వనరుల పథకాలు,

ఆర్థిక అభ్యున్నతి ఆరంభ దశలో అవసరమే. కాని తరువాత దశల్లో కూడా వీటి ప్రాముఖ్యత తగ్గదని చెప్పలేము. పెద్ద పెద్ద పెట్టుబళ్ళు చేసేటప్పుడు, ద్రవ్యోల్బణస్థితి ఏర్పడే అవకాశం చాలా ఉంటుంది. కాబట్టి ఈ చిన్న చిన్న పరిశ్రమలను, ప్రాజెక్టులను తాత్కాలిక ఉపశమనాలుగా అభివృద్ధి పరచవచ్చును.

ఇదే విధంగా గాంధీజీ చేసిన ఇతర ఆర్థిక ప్రతిపాదనలను కూడా పరిశీలించవచ్చును. కాని ఆర్థిక ఆశయాలతో సహా అన్ని ఆశయాలనుకూడా సాధించడానికి ఉపయోగించవలసిన సాధనల గూర్చి గాంధీజీ చేసిన సూచన, చూపిన మార్గం, అత్యంత మహత్తరమైనది. ఆర్థిక సమస్యల పరిష్కారానికి ఆయన చేసిన సేవనుకూడా ఈ దృష్టితోనే చూసి విలువ కట్టవలసి ఉంటుంది. ఆచరణకు అతీతమైన కొన్ని ఆశయాలను విస్మరిస్తే భూదానోద్యమం, మన ఆశయ సాధనకు కల మార్గాలలో ఒకటి కాగలదు. కాని గత ఆరు సంవత్సరాల అనుభవాన్ని బట్టి చూస్తే ఈ ఉద్యమ సాఫల్యం అనుమానాస్పదంగా గోచరించినా, భూసంస్కరణల ఆవశ్యకతకు అనుకూలంగా ఈ ఉద్యమం ప్రజాభిప్రాయాన్ని నిర్మించిందని ఒప్పుకోవాలి. గాంధీజీ చూపిన సహాయ నిరాకరణం లాంటి ఇతర మార్గాలు కొన్ని వివాదాలకు దారితీస్తాయి. వాటిని పరిశీలించడం ప్రస్తుతం నాకు ఇష్టం లేదు. మన ప్రథమ, ద్వితీయ ప్రణాళికల్లో గాంధీ తత్వం ఎంతవరకు ఉందో కూడా నన్ను చెప్పమన్నారు. కాని ఈ అంశంపై

నేనేం చెప్పినా అది వివాదాస్పదం అవుతుంది. ఈ వివాదంలో ప్రవేశించడం నా కిష్టంలేదు. కాని గాంధీజీ ఆర్థిక దృక్పథం గూర్చి పైన నేను చెప్పిన మాటలు, మన ప్రణాళికలను గాంధీ వాద దృష్టితో పరిశీలించడానికి తోడ్పడుతాయనుకుంటాను. అయితే ఆర్థిక జీవితం పరస్పరాధార భూతమైనది కావడంవల్ల, నవీన సాంకేతిక శాస్త్ర నిర్మితమైన ఒక వస్తువు లేక పనిముట్టు వాడకానికి మనం సమ్మతిస్తే మన ఇతర అవసరాలను తీర్చే ఇతర పనిముట్లకు కూడా సమ్మతించ వలసి ఉంటుంది. తార్కికంగా చూస్తే ఇది సహజం.

ముగించే ముందు ఒక మాట చెబుతాను. నేటి సాంఘిక జీవితంలో మౌలికమైన గాంధీజీ ఆర్థిక సాంఘిక విధానాలకు హెచ్చు ప్రాముఖ్యత ఇవ్వాలే కాని, నిత్య పరిణామం చెందే సమస్యల పట్ల ఆయన వెలిబుచ్చిన భావాలకు కాదు. కొందరు వ్యక్తులు ఈ భావాలను స్థూలంగా ఆచరించడంలో వి[illegible]లు కావచ్చును. కాని, సమా[illegible] జీవన [illegible] నూతన భావాలకను[illegible] మార్చుకోవాలంటే మన నిరీక్షణ అనంతమైనది కాకతప్పదు.

---

## గాంధీజీ సిద్ధాంతాలు— కాంగ్రెసు

### శ్రీ యం. యస్. రాజలింగం

"గాంధీజీ - కాంగ్రెసు" అనే విషయాన్ని గురించి తెలుసుకోవాలని ప్రయత్నించ బోయేముందు ఆనాడు భారత దేశపు పరిస్థితి కొద్దిగా అవగాహన చేసుకోవటం ఎంతేని అవసరం. అప్పుడు గాని గాంధీజీ యొక్క నూతన దృక్పథం కాంగ్రెసులో ఎంత మార్పు తెచ్చిందో మనకు బోధపడదు.

గాంధీజీ భారత దేశ రాజకీయ స్వాతంత్ర్యంతో సంబంధం పెట్టుకునేనాటికి, మితవాదుల అతివాదుల సంఘర్షణ దేశంలో తీవ్రరూపంలో ఉండేది. అయితే ఇరుపక్షాల వారికీ వాదాలలో తీవ్రతతప్ప, ఒకనిర్దిష్టమైన కార్యక్రమం లేకుండెను. ఈ అదను కనిపెట్టి ప్రభుత్వం తన కుయుక్తులు తాను పన్నుతూ వచ్చింది. తీరా సూరతు సభను జరిగే నాటికి మితవాదులు తమ సంఖ్యాబలంతో అతివాదులను కాంగ్రెసు నుంచి తరిమి వేశారు. ప్రభుత్వానికి ఆనాడు కావలసిందే అది. ఈ కొద్దిపాటి అవకాశాన్ని గైకొని ప్రభుత్వం అతి వాదులను వెన్నాడి తీవ్ర శిక్షలకు గురిచేయ ప్రారంభించింది.

ఈ దశలో గాంధీజీ రావడం, కనీసం ఒక సంవత్సర మైనా పరిస్థితులను అర్థం చేసుకోవడానికి వినియోగించ వల సిందనీ, గోఖ్లే గాంధీజీకి సలహా ఇవ్వడం జరిగింది. గాంధీజీ ఆనాటికే దక్షిణాఫ్రికా ఉద్యమాల మూలంగా భారతీయుల హృదయ పీఠాన్ని అలంకరించారు. తొలి మెట్టులోనే ఆయన నాయకుడై భారతీయుల ఎదుట నిలిచాడు. అయినా పెద్దల పట్ల ఆయనకుండే గౌరవ భావం కారణంగా గోఖ్లే సూచనను అంగీకరించి పరిస్థితులను అవగాహనం చేసుకోవడం మొదలుపెట్టాడు.

ఆ యత్నంలో యీ క్రింది అంశాలు అతని దృష్టికి వచ్చాయి. మొదటిది స్వాతంత్ర్యం కావాలని. చదువు కున్న వారు; కాని వారు కొందరు తీవ్రంగా యత్నించినా ప్రజ లను ఆ ఉద్యమం అంతగా ఆకర్షింప లేకపోయింది. దీనికి కారణం స్వాతంత్రమంటే బ్రిటిషు వారుపోయి భారతీయులు రాజ్యంచేయడం అనే అర్థం మాత్రమే ప్రచారమై ఉండటం కావచ్చు. అయితే ఇలాంటి స్వాతంత్రం వల్ల కొందరు వ్యక్తులకు అధికారం రావచ్చునే కాని సాధారణ ప్రజలకు కలిగే లాభం, వారి జీవితంలో కలిగే మార్పు ఏమిటి? అనే ప్రశ్న గడ్డు సమస్యగా ఆనాడు ప్రజల ఎదుట నిలిచింది. దానికి సరియగు సంతృప్తి కరమైన సమాధానం చెప్పే నాథుడు లేక పోయినాడు. రెండవది— మితవాదం, అతి వాదం సంఘర్షణ సిద్ధాంత రీత్యా ఉన్నప్పటికీ స్వల్ప విష యాలలో ఇరు పక్షాలు వివాదాలకు దిగకుండా తప్పుడు

ప్రతిష్ఠలకు, జిద్దులకు దారి తీయకుండా, ఐక్యత కలిగించేంత బలమైన ప్రజాభిప్రాయం మన దేశంలో లోపించి యుండెను. మూడవది— ప్రభుత్వం ఈ సంఘర్షణాలను అదనుగా తీసుకుంటూ స్వాతంత్ర్య పిపాసువుల సంఖ్యను తగ్గించుటకు చేసే ప్రయత్నాన్ని అరికట్టే శక్తి ఆనాటి నాయకులలో లేక పోయింది. పైగా వారు సదుద్దేశంతో చేసే కృషి కూడా స్వాతంత్ర్య వీరుల సంఖ్యను పెంచడానికి ఎంత తోడ్పడాలో అంత తోడ్పడలేకపోయింది. అంటే సరియైన నాయకత్వపు లోపం కూడా ఉండి తీరిందన్నమాట. నాలుగోది— ఉన్న కొద్ది నాయకత్వానికైనా నిర్దిష్టమైన కార్యప్రణాళిక లేక పోయింది. అయిదోది, ఈ నాయకత్వాన్ని జీర్ణించుకుని ప్రజలదాకా దాని భావాలను, వారుకోరే కార్యభారాన్ని వహింపచేసే ప్రజా సంస్థ ఏదీ లేకపోయింది. ఉన్న కాంగ్రెసు ఒక విద్యావంతుల వేదికగానే ఉండిపోయింది గాని, ఆనాటి కది ప్రజా సంస్థ రూపం దాల్చలేక పోయింది. ఆరవది— భారతీయ నాయకులందరూ, ఏ పక్షానికి చెందిన వారైనా ప్రజల మాతృభాషద్వారా స్వాతంత్ర ఉద్యమాన్ని నడపాలనే అవసరాన్ని గుర్తించకుండా ఇంగ్లీషులోనే ఉపన్యాసాలు, తీర్మానాలు చేస్తూ వచ్చినందువల్ల వారి ఆశయాలను భారత ప్రజ అర్థం చేసుకోలేక పోయింది.

ఈ వాతావరణాన్ని మార్చిన గాంధీజీ అభిప్రాయాలను చాలామంది గాంధీజీ సిద్ధాంతాలంటారు. కాని ఆ సిద్ధాంతాలను గురించి బాగా ఆలోచిస్తే వాటి మూలం

ఎచటో మన భారతీయ సంస్కృతిలో నొక భాగంగా కన్పి స్తవి. అందుకనే ఆయన వరకు ఆయన ప్రజలనుకునే గాంధీ సిద్ధాంతాలన్నీ ఒక జీవిత విధానంగా మాత్రమే గుర్తిం చాడు. దానికి ఒక ముఖ్య కారణం అది జీవన విధానమంటే తనకు సాధ్యమైంది. ఇతరులకు కూడా కృషి ఫలితంగా సాధ్యం కావచ్చునని ఆయన అనుకోలేకపోలేదు. అందుకనే ఆయనను సాధారణ మానవునిగా చూడాల్సిందని ఎన్నో సార్లు విజ్ఞప్తి చేశాడు. మనం మాత్రం ఆయనను మహాత్ము డంటూ పోయాం. అంటే ఆయనకు సాధ్యమైనవి కొన్ని మనకు సాధ్యంకావని అనుకొంటూ మనం నిర్వర్తించ వలసిన బాధ్యతలను తప్పించుకోవటంలో సంజాయిషీ చెప్పు కొనే వీలు కలుగ జేసుకున్నామన్న మాట.

ఈ దృష్టితో గాంధీజీ సిద్ధాంతాలు, అంటే ఆయన భాషలో మనజీవిత విధానం, కాంగ్రెసులో ఎలాంటి మార్పులు తెచ్చింది, ఎలాంటి ప్రభావం కాంగ్రెసుపై వేసింది అనేవి ఇక మనం చర్చిద్దాం.

ఆయన రంగంలోకి రాగానే యే యే లోపాలు తన పరిశీలనలో కన్పించినవో వాటిని సవరించాడు.

మొట్టమొదట స్వాతంత్ర్యమనే పదానికి సాధారణంగా ఉండే భావాన్ని మార్చి ఒక నూతన దృక్పథం కల్పించాడు. స్వాతంత్ర్య మంటే కేవలం తెల్లవాడుపోయి మనవాడు రాజ్యం చేయడమని కాక స్వాతంత్ర్య మన్నా స్వరాజ్య

మన్నా ఆర్థిక, సామాజిక, రాజకీయ స్వాతంత్ర్యమని ఆయన ఘోషించాడు. అది ప్రజలకు అర్థమయ్యే భాషలో చెప్పేం దుకై కొన్ని సులభ మార్గాలు ఆయన కనిపెట్టాడు. దారి ద్ర్యంలో వున్న స్వాతంత్ర్యం నిజమైన స్వాతంత్ర్యం కాద న్నాడు. అస్పృశ్యతతో ఉన్న స్వాతంత్ర్యం స్వాతంత్ర్యం కాదన్నాడు. అలాగే శోషణ పద్ధతికి దారితీసే యే స్వాతం త్ర్యం కూడా నిజమైన స్వాతంత్ర్యం కాదని ఆయన భావిం చాడు. ముఖ్యంగా స్వాతంత్ర్య పిపాసువులైన బ్రిటను, అమె రికా దేశాలు వివిధ రకాలైన సామ్రాజ్య స్థాపనకు దారి తీస్తున్న ఆ రోజుల్లో గాంధీజీ చేసిన ఆ నిర్వచనం ప్రాముఖ్యత ఎంతో తెలుస్తున్నది. క్లుప్తంగా చెప్పాలంటే, ఆర్థిక రాజ కీయ, సామాజిక సమానత వుంటేనే గాని అది నిజమైన స్వాతంత్ర్యం కాదని ఆయన భావించాడు.

దీనిని సాధించేందుకై సాధారణంగా ఏఏ శక్తులయొక్క బలహీనతలు అడ్డము వస్తున్నాయో వాటిని అతడుఎదుర్కొనే ప్రయత్నం చేశాడు. మూఢాచారాలు, సాంప్రదాయాలు, అస్పృశ్యతకు కారణం కనుక దేశంలోని మధ్యతరగతి వర్గా లను, ముఖ్యంగా సనాతనుల వర్గాన్ని ఆయన మార్చే ప్రయత్నం చేశాడు. అలాగే అనేక విషయాలలో ఆయన మధ్యతరగతి వర్గంతో ఒక విప్లవం తీసుకొచ్చాడు. దాని ద్వారా ఒక గట్టి ప్రజాభిప్రాయాన్ని నిర్మించాడు. అట్టి నిర్మాణంలో అతి వాదుల శక్తిని కేంద్రీకరించి స్వాతంత్ర్యానికి అడ్డువచ్చే సామాజిక లోపాలను దూరం చేశాడు. ఆ

జీవితంలో అనేకు చాలా విశాల దృక్పథం కనపరచాడు. తన చర్యలవలన ఆ విశ్వాసాన్ని ప్రజలు గుర్తించేట్టు చేయ గలిగాడు. ఉదహారణగా ఆస్తికత్వం యొక్క ప్రాముఖ్యతను చాటుతూనే అస్పృశ్యతా నివారణకు ప్రయత్నించాడు. హిందూ ముస్లిం ఐక్యత యొక్క ప్రాముఖ్యతను నొక్కి చెప్పుతూ ఖిలాఫత్ ఉద్యమంలో హిందూ ముస్లిం విభేదం లేకుండా అందరూ భాగస్వాము లయ్యేట్టు చూచాడు. పరమ నాస్తికునియొక్క నాస్తికత్వము కూడా తన ఆస్తి కత్వానికి భిన్నం కాదంటూ రెండు విభిన్న దృక్పథాలను సమన్వయపరచి వెంట తీసుకెళ్ళ గలిగాడు. భారీపరిశ్రమలు కొన్ని హద్దుల్లోఅవసరమేననిఒప్పుకుంటూనే 'ప్రతిగ్రామయొక్క ప్రతిచుట్టు స్వాతంత్ర్య సంపాదనకూ, దాన్ని నిలుపుకోడానికి ఒక్కొక్క మెట్టని' ఆయన వివరించాడు. ఈ విధంగా ఆర్థిక రంగంలోకూడా కేంద్రీకరణ, వికేంద్రీకరణ సూత్రాలను అను భవ రంగంలో సమన్వయంచేస్తూ ముందుకు పోయినాడు.

వీటన్నిటికన్నా వ్యక్తి ప్రాముఖ్యతను సంస్థకు లొంగు బాటు చేసే ఉద్యమాలు నడిపాడు. అందుకనే రౌండు టేబిల్ కాన్ఫరెన్సుకు పోయినప్పుడు తనను మఱచి, తనకు అధికార మిచ్చిన కాంగ్రెసు పట్ల సభికుల దృష్టి ఆకర్షింప బడేట్టు చేశాడు. ఈవిధంగా ప్రజా సంస్థ ఒకటి లేదనే లోపం తీసి వేసి కేవలం ప్లాటు ఫారం చర్చలకే పరిమితమైన కాంగ్రెసును ఒక ప్రజా సంస్థగా తయారు చేశాడు.

ప్రజల కర్థమయ్యేట్లుగా, ఆయా ప్రాంతీయ భాషలలోనే కాంగ్రెసు చర్యలు తీర్మానాలు చేయించి, కాంగ్రెసు పిలుపును ప్రజలకందేట్టు చూస్తూ భాషాలోపం కూడా లేకుండా చేశాడు. అంతేగాక మహోద్యమాలన్నీ ప్రజలకు సులభంగా అర్థం అయ్యేట్టు నినాదాలు ఇప్పించాడు. "ఉప్పుపై పన్ను పోవాలంటే స్వాతంత్ర్యం కావాలి", 'అంటరానితనం పోవాలంటే స్వాతంత్ర్యం కావాలి' అనే సామాన్య నినాదాల ద్వారా, తానూహించే స్వతంత్ర భారతదేశపు రూపురేఖలను, ప్రజల కంటికి గోచరమయ్యేట్టు చిత్రించాడు.

అదే విధంగా వ్యక్తిస్థాయి సంస్థలయొక్క సాధారణ నీతికి ఉన్నంతగా ఉంటే గాని ఆ సంస్థయొక్క కార్యక్రమాలు సక్రమంగా నడవడనే విషయం ఆయన యెన్నడో గుర్తించాడు. అందుకే కాబోలు ఈ అంశం అతని స్వభావంలో ఒక భాగంగా మారిపోయింది. దాని ప్రభావం ఇతరులకు ఆదర్శంగా ఉండిపోయింది. అందుకని నిర్మాణ కార్యకర్తలలో పెక్కుమంది ఇప్పటికీ బయట ఉండే పెద్దపెద్ద సంస్థలను నడిపించడం మనం చూస్తూంటాం. ఈ పైచర్యలవల్ల గాంధీజీ తను చూసిన కొన్ని ముఖ్యమైన లోపాలను సవరించగలిగాడు. ఇందులోని ప్రతిచర్య అతని సాధన మార్గంలో ఒక భాగం. అదే క్రమేణా అతని జీవిత విధానంగా మారిపోయింది. అలా రూపు దిద్దుకున్న జీవిత విధానాన్నే ప్రజలు గాంధీజీ సిద్ధాంతాలు అంటారు.

ఈ విషయాలన్నింటినీ ఆచరించేందుకు ఆయన అనేక కార్యక్రమాలు రచించాడు. ఏ కార్యక్రమమూ అతను రహస్యంగా ఉంచలేదు. రహస్యమనేది దేశానికి తగిరాదని అతనిఅభిప్రాయం. అంతేగాకసత్యాహింసలే అతనిఉద్యమానికి పునాది కనుకరహస్యానికిఅతనివద్ద తావులేకపోయింది.సత్యము, రహస్యము అనేవి రెండూపొత్తు కుదరని విషయాలని తెలుసు. గాంధీజీ రహస్యము వద్దన్నప్పుడల్లా వెక్కిరించిన వారు లేక పోలేదు. కాని రహస్యం మీదనే విజయం సాధించ దలచిన దౌర్జన్యవాదులు పొందిన ఫలితాలేమిటి? వారి అను భవాలేమిటి? అనే ప్రశ్నలు ప్రతి స్వాతంత్ర్య వీరుడూ ఆరోజుల్లో ఆలోచించుకోక తప్పిందికాదు. రహస్య చర్యల యొక్క ఫలితంగా, కసి తీసుకోడానికై బ్రిటిషు ప్రభుత్వం దౌర్జన్యానికి పూనుకున్నది. అనేక నేరాలకు అనేకుల్ని గురిచేసింది. దాంట్లో వారనుకొనే నేరంతో సంబంధం ఉన్న వాళ్లూ లేని వాళ్లు కూడా గురిఅయ్యారు. ఈ విధంగా స్వాతంత్ర్య వీరుల సంఖ్యాబలం కొంత తగ్గింది. అదే విధంగా బాధకు తట్టుకోలేక కొందరు రహస్యాలను బయట పెట్టటం కూడా జరిగింది. వీటన్నిటివలన రహస్యాన్ని ఉంచడం అసంభవమనే విషయం స్పష్టమైంది. అథవా ఎవరన్నా ఉంచగలిగారంటే అది వ్యక్తి గొప్ప తనమే అయింది గాని జాతి లక్షణంగా పరిగణించే వీలు లేకుండా పోయింది. అలాగే ఉద్రేకంలో వచ్చే విప్లవం నిలిచేది కాదని ఆయన భావించాడు. అంతేకాక, సత్యానికి భిన్నంగా విప్లవం కోసం పోరాటాలు నడిపితే, గెలుపు లభిస్తుందని కాసేపు భావించినా, గెలుపు అనంతరం, పరిపా

లనా యంత్రాంగాన్ని నడప వలసినవారు వారేఅవుతారు కనుక అలాంటి వారు తమ బాధ్యతలను తగు విధంగా నిర్వర్తించగలరా? అనే సందేహాన్ని వ్యక్తపరచిన వారు లేక పోలేదు. ఈ విధంగా ఆలోచించే వారు గాంధీజీ విశ్వాసంతో ఏకీభవించక పోయినా ఒక ఎత్తుగడ క్రిందనన్నా ఆయనతో ఏకీభవించారు. అట్లాగే అనేక మందికి గాంధీజీ విశ్వాసా లలో నమ్మకం కుదరక పోయినా ఆయన చూపించే కార్యక్రమాలలో పాల్గొనడం కన్న వేరే గత్యంతరం లేక పోయింది. తార్కికదశ, వాస్తవిక పరిస్థితులు వారిని గాంధీజీ సిద్ధాంతాలకు లొంగజేశాయి.

గాంధీజీ జీవనానికి పునాదియైన సత్యం, అహింసలు 'ఎందుకు?' అని అడిగే వారు లేకపోలేదు. కాని గాంధీజీ అనుయాయులు వారిని, ప్రజలందరూ అసత్యం చెప్పి సమాజం ఏవిధంగా ఉంటుందో ఆ చిత్రాన్ని ఊహించి చెప్పమంటే వారికి తెల్లమొహం వెయ్యవలసి వచ్చేది. అటువంటి సమాజంలో శాంతి భద్రతలకు తావుండదనే విషయాన్ని వారంగీకరించక తప్పేదికాదు. అందుకనే గాంధీజీ సత్యం తనకు విశ్వాసంగా మారిందనేవాడు. మిగతావారు మేమొక పాలసీగా అంగీకరిస్తున్నా మనేవారు. అటులే గాంధీజీ యొక్క అహింస ఆయనకు అది కూడా ఆత్మ విశ్వాసం క్రిందేలెక్క. హింసనే విశ్వసించే ప్రజలు శాంతి సౌభాగ్యాలతో కూడుకున్న సమాజాన్ని నిర్మించలేరని అతని విశ్వాసం. మిగతవారు హింసను నమ్మకపోయినా బ్రిటిషు

ప్రభుత్వం ఎదుట హింసాతత్వం యొక్క పరిణామాలను ఒప్పుకోక తప్పిందికాదు. ఎందుకంటే భారతీయులు స్వాతంత్ర్యము కొరకు చేసే హింస కన్న బ్రిటిషువారు దాని నణచేందుకు చేసే హింస గొప్పగా వుండేది. హింస ద్వారా గెలవచ్చు, కాని తద్వారా ఎల్లప్పుడూ సత్యానికే జయం చేకూరుతుందని చెప్పలేము. గొప్ప హింసతో అసత్యాన్నయినా గెలిపించవచ్చు. అదే బ్రిటిషు వారిలోని ఒక తెగ యొక్క నమ్మకం. కావున గాంధీజీని అనుసరించే ప్రతి ఒక్కరు పెద్దపెట్టున హింసచేయలేరు కనుకనే గాంధీజీ అహింసను విశ్వసించి ఆయన అహింసా మార్గాన వారు నడిచారు. గాంధీజీ అహింసను "హింసకానిది అహింస" అని నిర్వచించేకన్న హింసను దూరంచేసే ప్రవృత్తిని పెంచుకోవటం మాత్రమే అని నిర్వచిస్తే బాగుంటుంది. ఎందు కంటే గాంధీజీ సైతం హింసను అంగీకరించిన ఘడియలు లేక పోలేదు. సాయిగానులో ఒక ఆవు యీనినది. పిండము అడ్డము తిరిగినది. గాంధీజీని ఆశ్రమ వాసులు ఏమి చెయ్యాలని అడిగారు. కాళ్లు కోసివేసి పిండాన్ని తీయమన్నాడు బాపూజీ. అలాగే పోలెండు ఆడవారు వచ్చి, తమను జర్మను వారు వచ్చి మానభంగాలు చేస్తున్నారని చెప్పారు. ఈ పైశాచిక కృత్యానికి ఏం చెయ్యాలని వారడిగారు. ఆయుధాలు లేకపోతే గోళ్లు, పండ్లు కూడా లేవా? అని వారిని గాంధీజీ ప్రశ్నించాడు. వాటిని ఉపయోగించి మానాన్ని రక్షించుకోవటం న్యాయమే. అది హింస కాదు అన్నాడు గాంధీజీ. ఒక సారి కూరగాయలు కోస్తుంటే — వాటిని అలా కోయడం హింస కాదా! అని ఆయనను ప్రశ్నించారు.

కూరలు తినటం న్యాయం, అందుకని కూరలు కోయటం కూడా న్యాయమే. అయితే అవసరానికి మించిన చిన్న చిన్న ముక్కలుచేసి కాలాన్ని వృధాచేయడం హింస అవుతుం దన్నారు. దీనిని బట్టి చూస్తే ఆయన అహింస కాలహార ణాన్ని కూడా క్షమించనదని బోధపడుతున్నది. ఒక పాము ను ఆశ్రమవాసులు పట్టుకున్నారు. దానిని చంపటమా మాన టమా అనేది పెద్ద సమస్య అయింది. ఆయనను ఆశ్రమ వాసులు సలహా అడిగారు. 'అది చాలా సుందరమైన పాము' అని మాత్రమే గాంధీజీ అనేకసార్లు సమాధానం చెప్పారు. దీని అర్థము ఆశ్రమ వాసులకు బోధపడలేదు. సుందరమైంది కనుక చంపవద్దనా? విష జంతువు కనుక సుందరమైంది ఐనా చంపమనా? గాంధీజీయొక్క ఈ చర్య ఒక విషయాన్ని స్పష్టం చేస్తున్నది. ఏమంటే అహింస అనేది తార్కిక సమస్య గాక, ఒక ప్రత్యేక పరిస్థితిలో ఒడు దుడుకు లేసి విచారణ యొక్క నిర్ణయం. ఒక ప్రవృత్తియొక్క స్వభావం అని బోధపడుతున్నది. అందుకని ఆశ్రమ వాసుల జిజ్ఞాస యొక్క ఫలితంగా తుదకాపాము కొన్ని రోజులు ఆశ్రమం లోని పాలు త్రాగుతూ కొన్ని రోజులు పెంచి తుదకు వదలి వేయబడింది. ఒకసారి గాంధీజీని"మీరుగాలి పీలుస్తున్నారు. అందులో అనేక క్రిములు చస్తున్నాయి. అది హింసకాదా!" అనికొందరు ప్రశ్నించారు. గాంధీజీ"అది నిజమే కావచ్చు కాని లోకానికి అతీతంగా నేను గాలి పీల్చటం కూడా మానివేసి నిలువ యత్నించినా దాంట్లో నేనుగెలువవచ్చు కాని సమాజ

నా వెంటరాదు. సమాజాన్ని వెంట తీసుకపోవడం నాకెంతైనా ముఖ్యం. అది, అహింసావాది ధర్మం" అని సమాధానం చెప్పారు. మరొకసారి 1942 లో 'చావో బ్రతుకో', నినాదా లిచ్చినప్పుడు ఇది హింసకాదా అని ప్రశ్నిస్తే 'నన్ను గొంతు పిసుకుతుంటే నే నెలా ఊరుకోవాలి?' అన్నారు గాంధీజీ. ఈ ఘట్టాలన్నీ గాంధీజీ అనుకొన్న అహింసా సిద్ధాంతం యొక్క వివిధ చాటులు. దానిని కేవలం 'హింస కానిది అహింస' అని పామరుడిలాగా అర్థం చేసుకొని ఆయనను ఆయన సిద్ధాంతాలను విమర్శిస్తే లాభం లేదు. క్లుప్తంగా చెప్ప దలిస్తే మానవత్వాన్ని పెంపొందించి పరిపూర్ణతకు దారి తీస్తూ యే రకమైన శోషణకు దారి తీయని ప్రతి చర్యా ఆయన అహింస యొక్క భాగంగా యిమిడి పోతుంది.

ఈ పునాదులపై ఉన్న ఆయన జీవన విధానం మరి కొన్ని న్యూనతలతో కూడా కూడి యున్నది. ఉదహారణంగా ధనవంతులనే వారంతా వారి ఆస్తికి హక్కుదారులుగాకాక ట్రస్టీలుగా భావించుకోవాలన్నాడు. ఈ విధంగా ప్రజలకు ధనవంతుల ఆస్తిమీద, ఈర్ష్యారహితమైన ఒకదృష్టిని అల వరచ ప్రయత్నించాడు. తోడుత ధనవంతులకు ఆస్తి పట్ల ఉండే Attachmen వ్యామోహం తీసివేయ ప్రయత్నించాడు.

అలాగే బాల విధవ అంటే కుమారి అని నిర్వచించాడు.

అవసరానికి మించి ఆస్తియున్న, ఆస్తిఅంతా దొంగ

తనం చేసి సంపాదించిన ఆస్తి క్రిందికే వస్తుందని ఆయన సూచించారు. ఈ లాంటి అభిప్రాయాలన్నిటికి, సంస్కృత వాఙ్మయంలోని మాటలు తీసుకొని, మన సాంస్కృతిక భూమికలోనే వానిని ప్రబోధించేవాడు. అంటే జీవితములోని ప్రతి చిన్న విషయానికి ఆయన ఒక కొత్త విలువను సృష్టించి వాటిమీద కొత్త అభిప్రాయలను వెలిబుచ్చాడు.

ఈ అభిప్రాయాలను వెలిబుచ్చే సందర్భములో స్వశక్తికి మించి చేయడానికి యత్నించడములో కాని, స్వశక్తి ద్వారా తన తప్పును దిద్దుకోవడంలోగాని ఆయన వెనుకంజ వేయలేదు. ఈ చిన్న ఘట్టం దీనికి ఉదహారణంగా ఉంటుంది. శ్రీ శాస్త్రిగారు విద్వాంసులు. ఆయన గాంధీజీకి ఒకనాడు ఒక మంచి శ్లోకం చదివి వినిపించారు. దాని అర్థం 'దేశానికి పనికి రాని శరీరం ఉండి లాభం లేదు' అని. అతనికి కుష్ఠువ్యాధి. ఈ శ్లోకం చదివి నప్పుడు ఇది తనకూ వర్తిస్తుందని ఆయన అనుకోలేదు. కాని 'ఈ శ్లోకం మంచిది. ఆచరణీయం' అని బాపూజీ అనగానే అతని కా అభిప్రాయం కలిగి చావడానికి నిర్ణయించుకున్నాడు. బాపూజీ' చావును ఆకస్మికంగా రానీయ కూడదని, ఆత్మ పరిశీలనకు అవకాశం ఇస్తూ రావాల'ని అన్నాడు. అతని ఉపవాసానికి, సుఖాన్ని కూర్చే నల్లమందు యిత్యాదివి శాస్త్రిని తీసుకోవద్దన్నాడు. కొద్ది రోజులైంతర్వాత ఆమరణ దీక్ష పూనిన శాస్త్రిని చూచి బాపూజీ ఈ క్రింది విధంగా అన్నాడు. 'శాస్త్రిజీ, నీ దీక్షా సందర్భములో ఏ దశలోనైనా బ్రతకాలని నీకు కోరిక కలిగితే, అయ్యో ఇందరి ముందు చస్తానన్నామే, మరి ఇప్పుడు బ్రతుకుతే ఎలా?

అనే భయం ఉండ కూడదు.' అన్నారు. శాస్త్రిజీకి బాపూజీ రోజూ మాలీషు చేసేవారు. శాస్త్రి కుష్ఠు వ్యాధి తగ్గ నారం భించినది. ఆయనకు బ్రతకాలనే కోరిక కలిగింది. బాపూజీకి ఈ విషయం చెప్పారు. బాపూజీ పాలు పోసి శాస్త్రి దీక్షను విరమింప చేశారు. శాస్త్రి రాముని దయ వల్ల కులా సాగా అయినాడని బాపూజీ ప్రకటించారు. ఈ ఘట్టంలో చూడ వలసినదొకటి ఉంది. బాపూజీ శక్తిని సరియగు అంచనా వేసి వినియోగించేవారు. ఏ కాలంలో యుద్ధమో ఏ కాలంలో రాజీయో అతను బాగా ఎరుగును. చిన్న వ్యక్తిగత జీవన సమస్యలలో చూపిన వైఖరే చాంపరాను ఉద్యమంలోను, 1920, 30, 42, ౪౭, వత్సరాలలో జరిగిన ప్రతి ఉద్యమంలోను పోరాటం రాజీ కనిపిస్తుంటవి. ఆయన విధానంలో రాజీ కూడా పోరాటంలో ఒక భాగం అని భావించాడు. కాబట్టి చట్టబద్ధమైన ఆందోళనలలో శాసన సభలను—బయట విప్లవమును రెంటినీ ఒకే పక్కన నడప గలిగాడు.

అటులే బాపూజీ యొక్క విషయమంతా కాంట్రాస్ట్ (Contrast) చూడటంలో ఉంటుంది. గాంధీజీ, వ్యక్తిగత సత్యాగ్రహం సందర్భంలో బ్రిటనుకు సహాయం చేయా లన్నాడు. స్వతంత్ర దేశాలే ఈ స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన గలవన్నాడు. ఇలా అంటూ తన ప్రజలకు మాట్లాడే స్వేచ్ఛ ఉండాలన్నాడు. అదివారు ఈయలేదు. మాట్లాడే స్వేచ్ఛ ఈయని దేశం స్వాతంత్ర్యం కోసం ఎలా పోట్లాడు

తున్నది? దాని వెనుకఉన్న నైతిక శక్తి ఏమిటి? అని ఆయన ప్రశ్నించాడు. ఇది ప్రపంచాన్ని ఆకర్షించింది. ప్రజాభిప్రాయం అనుకూలం కాసాగింది. ఈ విధంగా కాంటాక్ట్స్ స్థాపించి సత్యాన్ని చూపించే మహానీయుల్లో ఆయన ఒక్కడే అగ్రగణ్యుడయినాడు.

అలాగే మరికొన్ని గొప్ప విషయాలు అతనిలో ఉండేవి. వాటిలో ముఖ్యమైనది, అతడు మనుష్యులను పోగొట్టుకో లేదు. ఏ దశలో కూడ మనిషిని పోనీయలేదు. ఎప్పుడూ 'ఇన్ని వత్సరాలనుంచి నా వద్ద యున్న వ్యక్తి ఇన్ని పొరపాట్లు చేస్తే, క్రొత్తగా వచ్చేవారు ఎన్ని చేస్తారు?, అని ప్రశ్నించేవాడు, అతను పార్టీ గ్రూపులు ఉన్నగాని సరియైన ప్రాతినిధ్యం యివ్వడం గుర్తించడం జరిగేది కాని క్వాలిటీకి క్వాంటిటీ కన్న ప్రాధాన్యత ఉండేది.

ఈలాంటి కాన్సెప్ట్స (Concepts) (దృక్కోణాల) తో ఉన్న గాంధీజీ జీవిత విధానం యొక్క ప్రభావం కాంగ్రెసు సంస్థపై చాలా పడ్డది. కాంగ్రెసు అగ్రనాయకులందరూ దానికి దాసోహ మన్నవారే. డిగ్రీలలో తేడా యున్నా ఆ మార్గాలలో పోక తప్పింది కాదు.

దీనిని బట్టి గతంలో కాంగ్రెసుపై ఎంత ప్రభావం పడ్డదో మనం ఊహించ గలుగుతాం. ఆ ప్రభావం ఈనాడు ఎంత వరకు తగ్గిందో అంత మేరకు కాంగ్రెసు బలం తగ్గింది. ఇది మనం చూస్తూనే ఉన్నాం. దీన్ని బట్టి కాంగ్రెసుపై గాంధీజీ సిద్ధాంతాలు లేక ఆయన జీవిత విధానం ఎంత ప్రభావం వేసిందో ఊహించుకోగలరని విశ్వసిస్తున్నాను.

